నెవ్వరును వ్రాయలేదు. మంగళమహాశ్రీవృత్తము గ్రంథాంతమున నున్నచో నది కవి వ్రాసినదే యని మనము గ్రహింపవలెను — ఏలననగా, కావ్యము 'శ్రీ'తో ప్రారంభించి మంగళమహాశ్రీ వృత్తముతో సమాప్తిచేయుట నన్నెచోడుని కుమార సంభవముతో ప్రారంభమైనది. తరువాతి కవులు క్వాచిత్కముగా దానిని పాటించినారు. అట్టివారిలో మడికి సింగన యొకడు[5]. కాబట్టి సింగనయే యీ పద్యరచయిత.

3. సింగన పేర్కొన్న తొయ్యేటి అనపోతనాయకుడు క్రీ. శ. 1347 లో నున్న అనపోతానాయకుడనుట కేయాధారములేదు. సింగన తన తండ్రియైన అయ్యలు మంత్రి—తొయ్యేటి అనపోత భూపాలునకు మంత్రియని చెప్పియున్నాడు. ఈ అనపోతనాయకుని శాసనములు రెండింటిలోను, అయ్యలుమంత్రి ప్రస్తావనయేలేదు. కాబట్టి శాసనోదాహృతుడగు అనపోతనాయకుడు సింగన పేర్కొన్న అనపోతనాయకుడు కాడని నిర్ణయింపవచ్చును.

4. మడికి సింగనా ఎఱ్ఱాప్రెగడను పేర్కొనకపోవుటకు కారణ మతని స్వాతిశయభావమేయని ఇప్పటికేబదేండ్లకు పూర్వమే వీరేశలింగము పంతులుగారు తమ ఆంధ్ర కవుల చరిత్ర ప్రథమభాగములో సింగన జీవితమున వ్రాసియున్నారు—

ఇక మడికి సింగన క్రీ. శ. 1420 ప్రాంతము వాడే యగుట నిరూపింతును—

# I

సింగన తన [6] జ్ఞానవాసిష్ఠరామాయణమున, తన తాత అల్లాడ మంత్రిని గూర్చి యిట్లు వ్రాసియున్నాడు—

సీ. అతడు తిక్కనసోమయాజుల [7] పౌత్రుఁడై
కొమరారు గుంటూరి కొమ్మ విభుని
పుత్రి చిట్టాంబిక బుధలోక కల్పక
వల్లి వివాహమై వైభవమున
భూసారమగు కోటభూమి కృష్ణానదీ
దక్షిణ తటమున ధన్యలీల
నలరు రావెల యను నగ్రహారము తన
కేకభోగ్యంబుగా నేలుచుండి
గీ. యందు గోవెల గట్టి గోవిందు నెన్న
గోపికానాథుని ప్రతిష్ఠ గోరి చేసి
యఖిల విభవంబులందున నతిశయిల్లె
మనుజమందారుఁడల్లాడమంత్రి విభుఁడు-(1-29)

పై పద్యము ననుసరించి, తిక్కననుండి అల్లాడ మంత్రికి మూడు తరములు గడచినవి.

తిక్కన
|
1 వ తరము పుత్రుడు
|
2 వ తరము పౌత్రుడు_కొమ్మన
|
3 వ తరము—చిట్టాంబిక — భర్త అల్లాడమంత్రి.

అల్లాడ మంత్రి కొమారుదు అయ్యలు మంత్రి కొడుకు మన సింగన—అప్పుడా వంశక్రమ మిట్లేర్పడును.

అల్లాడమంత్రి
|
4 వ తరము అయ్యలుమంత్రి-
|
5 వ తరము సింగన-

పై క్రమమునుబట్టి సింగన తిక్కనకు 5 వ తరము వాడగుచున్నాడు. తిక్కన క్రీ. శ. 1260–70 ప్రాంతమువాడు గావున, తరమున కిరువదియైదేండ్లు లెక్కించినచో – 1260+125=1385 –1395 ప్రాంతము సింగనకాలమగును.

---

5. నన్నెచోడని కవితాప్రభావము మడికి సింగనపై చాలగలదు. దానిని మఱియొకప్పుడు తెలుపుదును.

6. జ్ఞానవాసిష్ఠ రామాయణము: వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్ వారిచే ముద్రితమైనది. రెండవ కూర్పు 1935.

7. ఇందే 'పుత్త్రుడై' అను పాఠము 6 వ పుట యందు గున చూపబడినది. కాని యిది సరికాదు.

ఉపలబ్ధములైన జ్ఞాన వాసిష్ఠ రామాయణ ప్రతులలో పౌత్రుడని యున్నను— అచ్చట సరియగు పాఠము ప్రపౌత్రుడని యుండనగును. అచటి పాఠము

"అతడు తిక్కన సోమయాజి ప్రపౌత్రుడౌ
కొమరారు గుంటూరి కొమ్మవిభుని" అనునది.

ఈపాఠమిట్లే యుండదగుననుటకు ప్రమాణమున్నది. తిక్కన సోమయాజి వంశవృక్షమిప్పటికి డెబ్బదియేండ్ల క్రిందట ప్రకటితమైనది[8]. అందిట్లుగలదు.

తిక్కన-
|
కొమ్మన-
|
హరిహరామాత్యుడు
|
కొమ్మన-

ఈ కొమ్మన తిక్కన ప్రపౌత్రుడైనప్పుడు మడికి సింగన సరిగా క్రీ. శ. 1420 ప్రాంతము వాడగును—

## II

ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారమున తాళపత్ర ప్రతులలో జ్ఞానవాసిష్ఠ రామాయణ ప్రతి గలదు. దాని సంఖ్య 1157/16. ఆ ప్రతిలో 190 తాటాకు చివర నీ క్రింది పద్యము గలదు.

'శ్రీకర శకాంకములు
సింధు రవ రామయుత
శీతకరమైన పరిధావిన్
ప్రాకట వసంతయుత
ఫాల్గునమునందు
సితపంచదశి కావ్యతిథి, కావ్య
శ్రీకి నిధియౌ
మడికి సింగన తెనుంగున
వసిష్ఠరామాకృతి
యొనర్చెన్—
చేకొని యహోబలము
శ్రీనరమృగేంద్రునకు
సేమముగ మంగళమహాశ్రీ.'

ఇది మంగళమహాశ్రీవృత్తము. సింగనపేరు— కృతిపేరు కూడ నుండుటచేత నిది సింగనకృతమే యనుట నిర్వివాదము. ఇదియు పద్మపురాణము నందలి మంగళమహాశ్రీ వృత్తము సింగనకృతమే యని నిర్ధారించుచున్నది.

ఇందు జ్ఞానవాసిష్ఠ కృతి రచనాకాలము కలదు. శకాబ్దములు సింధు—4. రవ—5. (పంచమహావాద్య ధ్వనులు) రామ—3. (పరశురామ, శ్రీరామ, బలరాములు –) శీతకర—1. ముందటి సూత్రము ననుసరించి— ఈ కాలము శకము—1354. దీనికి క్రైస్తవ శకాబ్దములు 78 కలిపిన –1354 + 78 = 1432 అగును. కావున జ్ఞానవాసిష్ఠకృతి రచనాకాలము క్రీ. శ. 1432. శకాబ్దములేకాక, తక్కిన వివరములు పద్యమున గలవు. పరీధావి సంవత్సర ఫాల్గున పౌర్ణమి శుక్రవారమున నీ కృతి ముగిసినది—అది క్రైస్తవ శకము. 1—3—1433 తో సరిపోవుచున్నది.

పై జ్ఞానవాసిష్ఠ రచనాకాలముబట్టి సింగన పద్మపురాణ రచనాకాలము క్రీ. శ. 1420 అగుట సమంజసమే యగుచున్నది. అయితే వీని రెంటి నడుమ పండ్రెండేండ్లవ్యవధి యున్నది ఈపండ్రెండేండ్లలోను, సింగన భాగవత దశమస్కంధ ద్విపదను రచించినట్లు మాత్రమే జ్ఞానవాసిష్ఠము నుండి తెలియుచున్నది.

---

8. అముద్రిత గ్రంథచింతామణి సం. 9.సంచిక 11; నవంబరు 1896. ఇందావంశ వృక్షమును గూర్చిన సంపూర్ణ వివరములు గలవు. నా 'తెలుగు కవుల చరిత్ర' తిక్కన యుగమున- తిక్కనకు పూర్వము గల ఏడుతరములతో నీ వంశవృక్షము జతపఅచి విపులముగా వ్రాసితిని. అది అముద్రితము.తెలుగు కవులలో నాటినుండి నేటివఅకు నవిచ్ఛిన్నముగానున్న కవి కుటుంబములలో తిక్కన దొక్కటియే యని చెప్పవచ్చును.

జ్ఞానవాసిష్ఠము వెనుక మడికి సింగన సకలనీతి సమ్మతమును రచించెను. ఇది సమగ్రముగా దొరకక పోవుటచేత గ్రంథాంతమున నెట్లున్నది తెలియుట లేదు. ఎట్లున్నను, నీ పండ్రెండేండ్లలోను సింగన సకలనీతి సమ్మతము రచించుటకు గ్రంథసేకరణము చేసి రచన ప్రారంభించి యుండునని తలంచుట సమంజసము.

సకలనీతి సమ్మత పీఠికలో నా గ్రంథ రచన క్రీ. శ. 1430 ప్రాంతము కావచ్చునని కలదు. కాని పై జ్ఞానవాసిష్ఠ రచనా కాలమువలన, సకలనీతి సమ్మతము, క్రీ.శ. 1440 లోపుగా రచితమైనదని నిస్సంశయముగా చెప్పవచ్చును.

ఈ నూతనాధారమునుబట్టి, సింగన పేర్కొనిన తొయ్యేటి అనపోత భూపాలుడు క్రీ. శ. 1347 ప్రాంతముననున్న అనపోతనాయకుడు కాడనియు, నాతని కుమారుడో మనుమడో యనియు నిశ్చయింప వచ్చును.

సింగన క్రీ. శ. 1400—1440 ప్రాంతమున వెలసి శ్రీనాథ మహాకవి సమకాలీనులలో నొకడై యుండెననుట స్పష్టమగుచున్నది.

---

జ్ఞాపిక:-తెలుగు భాషలో వేదాంత వాఙ్మయ శాఖకు సంబంధించినది సింగన వాసిష్ఠ రామాయణము. ఈ శాఖలో శైవ వేదాంత గ్రంథములే ప్రాథమికములు. అయినను-అద్వైత వేదాంత గ్రంథములలో వాసిష్ఠ రామాయణమే మొదటిది. కాబట్టి అది విపులపీఠికతో సుసంస్కృతముగా వెలయదగినది. ముద్రిత గ్రంథాది నున్న 'శ్రీమద్దివ్య మునీంద్ర చిత్తనిలయం' అహోబల గిరీశాయ' అను శ్లోకములు వ్రాత ప్రతులలో లేవు—

---



# మధ్యప్రాచ్యం: మూడవ యుద్ధం

"ఆంగీరస్"

మొదటి ప్రపంచ యుద్ధం అనంతరం టర్కీ పడిపోయింది. అప్పుడు పాలస్తీనా బ్రిటిష్‌వారి రక్షణక్రింద వుంచబడింది. ఆపనిచేసింది నానాజాతి సమితి. ఆ మొదటి ప్రపంచ యుద్ధంలో యూదులు చేసిన సేవకుగాను బ్రిటన్ వారికి పాలస్తీనాలో జాతీయ అధినివేశాన్ని కల్పిస్తానని మాట ఇచ్చింది. ఆమాట బెల్‌ఫోర్ ప్రకటనలోవుంది. అరబ్బునాయకులు ఆ బెల్‌ఫోర్ ప్రకటనను అంగీకరించారు. రెండో ప్రపంచయుద్ధం తర్వాత పాలస్తీనా సంరక్షణ వ్యవహారం ఐక్యరాజ్యసమితికి సంక్రాంతమైంది. నానాజాతిసమితి చేసిన ఏర్పాటులో మార్పులేదు. పాలస్తీనాలో యూదులకు జాతీయ అధినివేశ కల్పనం యథాప్రకారం కొనసాగించబడింది.

1947 నవంబరులో ఐక్యరాజ్యసమితి ఆమోదించిన విభజన పథకాన్ని అనుసరించి ఇజ్రాయల్ అన్నరాజ్యం ఏర్పడింది. అది యూదుల రాజ్యం. ఆ రాజ్యం ఏర్పడ్డానికి వెనుక పెద్దచరిత్ర పెద్దకథా వున్నాయి. ఇప్పుడు మధ్యప్రాచ్యంలో యూదులు, అరబ్బులుమధ్య జరుగుతూవస్తున్న యుద్ధాలకు కారణాలు ఆ చరిత్రలో గూడావున్నాయి. అయితే ఇస్రాయల్ అన్నరాజ్యం సర్వసత్తాకంగా ఏర్పడిన అనంతరంనుంచీ ఈ యుద్ధాగ్ని భగ్గున మండిపోతూ వచ్చింది.

ఇస్రాయల్ అంటూ ఒకరాజ్యం ఏర్పడినఅనంతరం మధ్యప్రాచ్యంలో మూడు యుద్ధాలు జరిగాయి. ఒక యుద్ధం 1948 లో జరిగింది. రెండవ యుద్ధం 1956 లో జరిగింది. ఈ 1956 యుద్ధంలో బ్రిటన్ ఫ్రాన్సులుగూడా పాల్గొన్నాయి. ఇప్పుడు 1967 జూన్‌లో జరిగిన మూడవ యుద్ధానికి కారణాలు ఆ రెండు యుద్ధాలలోనుగూడా ఇమిడి వున్నాయి.

మధ్యప్రాచ్యంలో పాలస్తీనాను విభజించి యూదులకు ఒక రాజ్యాన్ని ఐక్యరాజ్యసమితి ఏర్పాటుచేయడం అరబ్బులకు ఇష్టంలేదు. సమితిలోనూ వారు ఆ ఏర్పాటును వ్యతిరేకించారు. సమితి బయటా వ్యతిరేకించారు. సమితి బయట వ్యతిరేకతే యుద్ధం రూపంలో ప్రజ్వరిల్లింది. ఆ ప్రజ్వలనం 1948 లోనే ఇజ్రాయల్ అంటూ ఏర్పడిన వెంటనే ప్రారంభం అయింది. ఇంతవరకు నిరంతరాయంగా అట్లా ప్రజ్వరిల్లుతూనే వుంది.

మధ్యప్రాచ్యంలోని యీ వ్యవహారంలో అగ్రరాజ్యాలకు అంతగా ప్రమేయం అంటూ లేకుండా వుంటే, అచ్చట పరిస్థితి ఎట్లా రూపు పొంది వుండేదో, చెప్పలేము. ఎందుచేతనంటే అగ్రరాజ్యాల ప్రమేయం లేకుండా అచ్చట జరిగే పనులు లేవు. అగ్రరాజ్యాల ప్రమేయం లేకుండా అచ్చట జరిగిన యుద్ధంలేదు. అందువల్ల మధ్యప్రాచ్యంలో ఒక యుద్ధం జరిగింది అంటే అందులో నిజానికి రెండు రకాల యుద్ధాలు ఇమిడివుంటున్నాయి. ఒకటి అగ్రరాజ్యాలమధ్య సాగుతున్న ప్రచ్ఛన్నయుద్ధము; రెండవది ఇస్రాయిల్, ఆరబ్‌రాజ్యాలమధ్య జరుగుతున్న ప్రత్యక్ష యుద్ధము.

మొన్న జూన్‌లో జరిగిన యుద్ధాన్ని పరిశీలించి చూచినా, ఈ విషయం వ్యక్తం అవుతుంది. ఆ ప్రాంతంలోవున్న వివిధరాజ్యాల బలాబలస్థితిగతులను, అచ్చటి ఆరబ్‌రాజ్యాలలో ఆరబ్‌రాజ్యాలకు మధ్యవున్న తగాదాలను దృష్టిలో పెట్టుకొనిచూస్తే, ఆరబ్‌రాజ్యాలకు నిజంగా ఇజ్రాయల్‌మీద ఎక్కటిగా

పోరు సాగించగల పరిస్థితి లేదు. అచ్చట బలాబల పరిస్థితిలో ఒకవిధమైన ప్రతిష్టంబన ఏర్పడివుంది. 1967 జూన్ యుద్ధం ప్రారంభం కావడానికి కొంత కాలం క్రిందట ఈ విషయం ఇట్లా అని—ఇట్టి పదజాలంతో కాకపోయినా—అరబ్ రిపబ్లిక్ అధ్యక్షుడు శ్రీ నాసర్ తన మిత్రులకు కొందరికి చెప్పివున్నట్లు చెబుతారు. ఇస్రాయల్‌తో నిజమైన యుద్ధం చెయ్యాలంటే, అరబ్ రాజ్యాలు ఇంకో ఇరవై సంవత్సరాలు వేచివుండటం అవసరమని ఆయన అన్నారట. ఈ మాటలు ఆయన కారణంలేకుండా అనివుండరు. తన చుట్టూవున్న దేశమే ఆయనకు అందుకు ఉదాహరణం. అరబ్‌రాజ్యాలలో ఏ రాజ్యమూ ఆర్థికంగా అభివృద్ధి చెందిలేదు. ఇటీవల ఆ రాజ్యాలను 'అభ్యుదయ రాజ్యాల'ని 'అభివృద్ధి నిరోధక'రాజ్యాలని 'అభివృద్ధికాములు' వింగడిస్తూ వచ్చారు. ఈ మాటలయొక్క వేషాన్ని తీసివేసి అసలు అర్థం చెప్పాలంటే, మధ్యప్రాచ్యంలో రాచరికంలేని రాజ్యాలకు, రాచరికంవున్న రాజ్యాలకు మధ్య ప్రచ్ఛన్న సమరమేగాక, ప్రత్యక్ష సమరం కూడా నడుస్తూవుంది. ఇందుకు యెమెన్ క్షేత్రం అయిపోయింది. యెమెన్‌లో రాజరికాన్ని కూలద్రోసి, అరబ్ రిపబ్లిక్ అధ్యక్షుడు రిపబ్లిక్‌ను నెలకొల్పారు. కాని ఆ రిపబ్లిక్, అరబ్ రిపబ్లిక్ అధ్యక్షునకు బరువై పోయింది. అచ్చట రాచరికపు వాదులను నిరోధించడానికి శ్రీ నాసర్ తన సైన్యాలను దింపవలసివచ్చింది. యుద్ధం కొనసాగిస్తూ వుండవలసివచ్చింది. మొన్నటి జూన్ యుద్ధం జరుగుతూవున్నప్పుడు గూడా ఈజిప్టు సైన్యాలు యెమెన్‌లో కొన్ని వుండనే వున్నాయి.

మధ్యప్రాచ్యపు రిపబ్లిక్ రాజ్యాలు వున్నాయంటే, వానిలో వానికి పడుతున్నట్లుగూడా చెప్పలేము. ఒకప్పుడు సిరియా, ఇరాక్, ఈజిప్టులను కలిపి ఏకసమాఖ్యగా ఏర్పాటుచేయాలన్న ప్రయత్నం జరిగింది. ఈజిప్టు అన్నపేరు అరబ్ రిపబ్లిక్‌గా మారడానికి కారణం ఇదే. కాని అచ్చట అరబ్ రిపబ్లిక్ అన్నపేరుమాత్రం మిగిలింది గాని సమాఖ్య ఏర్పడలేదు.

ఇవి అన్నీ ఇచ్చట చెప్పడం దేనికంటే ఇస్రాయల్‌తో రెండు యుద్ధాలుచేసినా, మూడో యుద్ధం చేయవలసిన పరిస్థితి ఏర్పడినప్పుడుకూడా అరబ్ రాజ్యాలతో ఆ తగాదాలు అట్లానేవున్నాయి. వారిలో ఐకమత్యం లేదు. ఇస్రాయల్ ఉనికి, స్థితిపట్ల ద్వేషం గూడాఆ ఐకమత్యాన్ని వారిలో తెచ్చిపెట కపోయింది. ఆ ఐకమత్యాన్ని తెచ్చిపెట్టగల పరిస్థితులు అచ్చటలేవు. అంతేగాక ఈ అరబ్ రాజ్యాలలో కొన్నిరాజ్యాలు తమ స్వంత ఆలోచననుబట్టిగాక ఎవరిదో అయిన ఆలోచనను బట్టి నడుచుకోవలసినస్థితిలో పడిపోయినాయి. వీరికి శిష్యాది గురువులుగా వుంటున్నవారిలో గూడా ఏకీభావం లేదు. మరి వీరిలో ఏకీభావాన్ని ఎట్లా ఆశించగలం?

1967 జూన్ యుద్ధానికిముందు పరిస్థితి ఇది. ఆ యుద్ధం జరుగుతున్న రోజుల్లోగూడా వారి మధ్య ఐకమత్యం ఏర్పడినజాడ కన్పించదు. బ్రిటన్‌లో వున్న యుద్ధవ్యూహసంస్థవారు ఈ జరిగిన యుద్ధాన్ని గురించి వ్రాస్తూ "అరబ్‌లు ఏకీకృతయుద్ధనిర్వహణాధికారవర్గం క్రింద తమ ప్రయత్నాలను కేంద్రీకృతం చేసుకున్నట్లు లేదు. ఈజిప్టు, సిరియా, జోర్డాన్—ఈ మూడుదేశాలు ఈయుద్ధంలో ఎవరి యుద్ధం వారు కొనసాగిస్తున్నట్లు తోస్తున్నది. ఇది ఇస్రాయల్‌కు ఎంతో కలిసివచ్చింది" అన్న ఒక అభిప్రాయాన్ని వెల్లడించివున్నారు.

అంతేగాక ఈ యుద్ధం జరుగుతున్నరోజుల్లో గూడా ఈ రాజ్యాలమధ్య ఆ యుద్ధాన్ని ఎట్లా నిర్వహించడం అనే విషయంపై ఏకీభావంవున్నట్లు తోచదు. యుద్ధం ముగిసినతర్వాత 'అల్‌థావ్రా' అనే డెమాస్కస్ పత్రిక ఇట్లా వ్రాసింది : "అరబ్‌బలాలు జోర్డాన్ రంగంనుంచి ఇజ్రాయల్‌మీదకు విక్రమించి వుంటే బాగుండివుండేది. జోర్డాన్ బలాలు దెబ్బతీస్తూ వుంటే, సిరియా ఈజిప్టుల బలాలు ఇస్రాయల్ బలాలను కదిలేందుకు వీలులేకుండాచేస్తూ "డెఫెన్సివ్" ఎత్తుగడలతో యుద్ధం సాగించివుండవలసింది."

కాని అట్లా జరగలేదు. అంతేగాక ఈయుద్ధంతో శ్రీ నాసర్ కొన్ని తొందరపాటు నిర్ణయాలు చేసినట్లుగూడా చెప్పబడుతున్నది. ముఖ్యంగా జోర్డాన్ విషయంలో జూన్ 6వ తేదీన శ్రీ నాసర్ జారీచేసిన ఉత్తర్వులు జోర్డాన్ పరాభూతికి కారణం అయినట్లు జోర్డాన్‌లో చాలామంది భావిస్తున్నట్లు చెప్పబడుతున్నది. వారు చెబుతున్న ఉదంతం ఈ విధంగావుంటున్నది: జూన్ 6 న అరబ్ రిపబ్లిక్ అధ్యక్షుడు శ్రీ నాసర్

జోర్డాన్‌రాజు శ్రీ హుస్సేన్‌కు ఒక సందేశం పంపించారు. ఈజిప్టు సైన్యాలు ఇస్రాయల్‌పై అన్ని రంగాలమీదుగాను విరుచుకు పడతాయని ఆయన ఆ సందేశంలో జోర్డాన్ రాజుకు తెలియజేశారు. అంతేగాక ఇస్రాయీలను ఈజిప్టు సైన్యాలు అన్నిరంగాలలోను ఎదుర్కొని వెనక్కు నెట్టుతున్నట్లు, అందువల్ల జోర్డాన్ సైన్యాలు హెబ్రీల్ ప్రాంతంపై తమ ధాటిని కేంద్రీకరించి పనిచేస్తే చాలునన్నట్లుగూడా శ్రీ నాసర్ తెలియపరచారట. శ్రీ నాసర్ పంపిన ఈ సందేశాన్ని చూచుకొని జోర్డాన్ సేనానులు తమ కవచ బలాలలో రెండు బ్రిగేడ్ల బలాన్ని అందుకు సన్నద్ధం చేసి, విమానదాడులు జరిగితే సంరక్షణవున్న ప్రాంతం నుంచి ఆ బలాలను కదిపారు. అంతే, ఆవెంటనే వానిపై ఇస్రాయల్ విమానాలు దాడిచేశాయి. ఆరెండు బ్రిగేడ్ల కవచబలాన్ని నాశనం చేశాయి. శ్రీ నాసర్ ఆ సందేశం తమ్మ ఇట్లా గోతిలో త్రోసిందని జోర్డానీలు భావిస్తున్నారు.

ఈ యుద్ధమే వుంది. ఈ యుద్ధం ఇప్పుడు జరగగలందులకు అవసరమైన పరిస్థితిని కల్పించవలసినంతటి అవసరం అరబ్ రాజ్యాలకు, ముఖ్యంగా సిరియా, ఈజిప్టులకు ఎందుకు వచ్చిపడింది? 1956 అనంతరం నుంచి 11 సంవత్సరాలపాటు ఉద్రేకాలు అంటూవున్నా, ఆ ఉద్రేకాలు పెచ్చురిల్లి యుద్ధంగా పరిణమించవలసిన పరిస్థితి ఎందుకు ఏర్పడింది? 1956 లో సమితిసేనల ఉనికికి అంగీకరించిన ఈజిప్టు—ఈ 1967 మే నెలలో ఆ సైన్యాలను ఉపసంహరించవలసిందని ఎందుకు కోరింది? సమితిసేనల ఉనికిని తన నేలమీద ఇస్రాయల్ ఆదినుంచి ఆమోదించలేకపోయింది, ఆమోదించలేదు—అన్న వాదం ఇచ్చట చెల్లదు. ఆ సమితి శాంతిసేనను ఇస్రాయల్ ఆమోదించలేదని అనలేము. తన నేలలోనికి రానీయలేదు. అంతే. ఈజిప్టు ఆమోదించింది. అందుకు ఒప్పందమే వున్నదందాము. అయినా ఆమోదించింది, ఆ ఆమోదం ప్రకారం తొమ్మిది, పది సంవత్సరాలపాటు ఆ సైన్యం అచ్చట వుంది. అతికీలకమైన ప్రాంతాలలో ఉద్రేకాలు రేగినా, ఆ ఉద్రేక ప్రకోపనం యుద్ధంగా పరిణమించకుండా చూస్తూ వుంది. అటువంటి శాంతిసేనను ఒక్క రోజున హఠాత్తుగా శ్రీ నాసర్ వెళ్లిపొమ్మన్నారు. ఎందుకు ఆయన అట్లా అనవలసి వచ్చింది?

ఇందుకు కారణంగా, ఒక కథ,—అది ఎంతవరకు నిజమో చెప్పలేము—ప్రచారంలోనికి వచ్చింది. ఆ ప్రచారంలోనికి వచ్చిన కథకు, సిరియాకు సంబంధవుంది. 1966 నవంబరులో సిరియా ఈజిప్టులు సమిష్టి రక్షణకు సంబంధించి ఒక ఒప్పందాన్ని కుదుర్చుకున్నాయి. ఇస్రాయల్‌ను ఏమోచేయడానికే ఈ ఒప్పందం కుదుర్చుకున్నాయన్నది నిర్వివాదమైన అంశం. ఇందులో ఇంకా ఇతరమైన ''వంగ్యాలు'' గూడా లేకపోలేదు. జోర్డాన్‌కు సిరియాకుపడదు. సౌదీఅరేబియా రాజు శ్రీ ఫైజల్‌కు, అరబ్ రిపబ్లిక్ అధ్యక్షుడు శ్రీ నాసర్‌కు పడదు. ఆ రెండురాజ్యాలను దృష్టిలో పెట్టుకొనిగూడా సిరియా ఈజిప్టులు ఈ ఒప్పందాన్ని కుదుర్చుకువుంటాయి. అయితే ఈ ఒప్పందం కుదరడంతోనే ఒకతగాదా వచ్చిపడింది. సిరియాలో బాత్‌పార్టీకి చెందిన అతివాదులు కొంతకాలం క్రిందట అధికారంలోనికి వచ్చారు. వారు రష్యాకు అనుకూలురు. ఈజిప్టుతోగూడా రష్యాకు సన్నిహితమైన సంబంధాలువున్నా, శ్రీ నాసర్‌కు ఈ బాత్‌పార్టీ అతివాదులు కూర్చిన స్నేహితులుకారు. ఈజిప్టు పరిపాలకులు అనేకసార్లు ఈ బాత్‌పార్టీనాయకులను—సిద్ధాంతంమీదవచ్చిన తగాదాలను పురస్కరించుకొని—దుమ్ముదులిపినట్లు దులిపివున్నారు.

సిరియా ఈజిప్టులమధ్య పరిస్థితులు ఇట్లావున్నాయి. ఈ పరిస్థితిలో 1966 నవంబరు 13 తారీఖున ఇస్రాయల్ 'సామో' అన్న సిరియా స్థావరంమీద దాడిచేసింది. ఈ దాడిని ఇస్రాయల్ ఎందుకు చేయవలసివచ్చింది అన్నది వేరేవిషయం. కాని దీనిమూలంగా అరబ్ రాజ్యాలలో లుకలుకలు బయలుదేరాయి. ఆత్మపరీక్ష ప్రారంభమైంది. ఇస్రాయల్‌ను ఎదుర్కొనవలసి వచ్చినప్పుడు తమ బలహీనతయొక్క లక్షణం ఏమిటోకూడా అరబ్ నాయకులు గ్రహించారు. కొందరు శ్రీ నాసర్‌ను ఎత్తిపొడిచారు. ''ఆయన కేమండీ, ఆయన్ను రక్షించేందుకు గాజాలో సమితిసైన్యం వున్నది'' అన్నారు. ఈ పరిస్థితి ఏర్పడినప్పుడు శ్రీ నాసర్—ప్రైవేటుగా—తన విమర్శకులకు—''సమయం పరిపక్వం అయినప్పుడు ఈ బలాన్ని పంపించివేస్తాను'' అని హామీ ఇచ్చారు—ఇది ఆ కథ సారాంశం.

ఇది నిజం కావచ్చు, కాకపోవచ్చు. కాని ప్రచారంలోనికి వచ్చింది.

ఈ కథే గనుక నిజమైతే 1966 అంతం లోనే గాజా మొదలైనచోట్లనుంచి సమితిసైన్యాన్ని పంపించివేయాలన్న అభిప్రాయం శ్రీ నాసర్‌కు కలిగింది. దాన్ని పంపించి వేసేందుకు సమయం 1967 మే నెలలో పరిపక్వం అయింది. అప్పుడు ఆయన ఆసైన్యాన్ని ఉపసంహరించవలసిందని సమితిని అడిగారు. అందుకు సమితి కార్యదర్శి ఆమోదించారు. సమితి సైన్యాన్ని ఉపసంహరించారు. ఆ వెంటనే శ్రీ నాసర్ సినాయ్‌కి సైన్యాలను పంపించారు. టిరాన్ జలసంధిమీద తమ ఆధిపత్యాన్ని నెలకొల్పుకున్నారు. అకాబా అఖాతంపై దిగ్బంధనాన్ని విధించారు. షర్మ్–అల్–షేక్‌లో తమ సైన్యాన్ని విడియింప చేశారు. అంటే చెప్పకుండా చేయకుండా ఇజ్రాయల్‌పై యుద్ధాన్ని ప్రకటించారు.

అకాబా అఖాతంపై దిగ్బంధం విధించడము, టిరాన్ జలసంధిని ఇజ్రాయల్‌కు నిరాకరించడము— ఈ రెండు పనులవలన యుద్ధాన్నిప్రకటించడంతో సమానం ఎట్లా అవుతుందన్న ప్రశ్న ఇచ్చట వస్తుంది. అది సహజం కూడాను. టిరాన్ జలసంధి ఈజిప్టుదా, సౌదీఅరేబియాదా అన్న తగాదా ఒకటి వుంది. టిరాన్ ఈజిప్టుదేనంటున్నవారు ఈ తగాదాకు గుర్తించక పోవడం విచారకరం. ఈ రెండు దేశాలున్నూ తమ తీరస్థ దేశంనుంచి 12 మైళ్ల మేర సముద్రప్రాంతాన్ని ''ప్రాంతీయ జలాల'' క్రిందనే పరిగణిస్తున్నాయి. ఈ లెక్కను టిరాన్ జలసంధిమీద ఈజిప్టుకు అధికారం వున్నట్లే సౌదీఅరేబియాకు అధికారం వుంది. టిరాన్ అన్నది అక్కడ చిన్నద్వీపం. ఈ 12 మైళ్ల ప్రాంతీయ జలం లెక్కను ఆ టిరాన్ ఇరుదేశాల క్రిందకు వస్తున్నది. ఈ తన హక్కును నిరూపించు కుంటూ వుండటానికి సౌదీఅరేబియా అడపాదడపా ఆద్వీపంమీద మిలటరీ స్థావరాన్ని నిల్పుతూవుంటుంది. ఇప్పుడు అరబ్ రాజ్యాలలో చెలరేగివున్న ఉద్రేకాలను బట్టి, ఈ తగాదా పైకిరావడంలేదుగాని, ఎప్పుడో ఒకప్పుడు వస్తుంది.

పోతే అకాబా అఖాతంలోనికి నౌకలు ప్రవేశించాలి అంటే అవి ఈ టిరాన్ జలసంధిద్వారానే వెళ్లాలి. ఇంకోమార్గంలేదు. ఈ అకాబాతో ఈజిప్టుకు పెద్ద ప్రయోజనం ఏమీలేదు. ప్రయోజనం వున్న దేశాలు రెండే వున్నాయి. ఒకటి ఇస్రాయల్, రెండవది జోర్డాన్. ఈ అఖాతంలో అకాబా రేవు జోర్డాన్‌ది. ఈలీత్ రేవు ఇస్రాయల్‌ది. ఆ ఈలీత్‌ను గూడా ఇస్రాయల్ అక్రమంగా, సర్వ ధర్మ విరుద్ధంగా ఆక్రమించుకున్నదని అరబ్ రాజ్యాలవాదం. ఆ వాదం ఎట్లావున్నా, కుగ్రామంగా వున్న ఈలీత్‌ను లోకోత్తరమైన రేవు పట్టణంగా ఇస్రాయల్ మార్చివేసింది. ఆ రేవుద్వారా బ్రహ్మాండమైన వ్యాపారాన్ని సాగించుకుంటున్నది. సూయజ్‌కు తూర్పున వున్న దేశాలతో ఇస్రాయల్ వ్యాపారం ఈ రేవుద్వారానే సాగుతుంది. సూయజ్ కాలువగుండా ఇస్రాయల్ నౌకలను ఈజిప్టు పోనీయదు గనుక, ఈ రేవును ఆ దేశం పెంపొందించుకోనవలసి వచ్చింది. అయినా లాభంలేకపోయింది. 1956 వరకు ఏదో ఒకవిధంగా టిరాన్ జలసంధిపై అదుపుద్వారా ఈజిప్టు, ఆ రేవునువుండిగూడా ఉపయోగంలేని స్థితిలోపెట్టింది. 1956 లో జరిగిన యుద్ధం అనంతరనుంచి టిరాన్ జలసంధిగుండా ఇజ్రాయల్ నౌకలు నడుస్తున్నాయి. ఇప్పుడు తిరిగి శ్రీ నాసర్ ఈ దిగ్బంధనం విధించడంతో పరిస్థితి మళ్లా మొదటికి వచ్చింది. మళ్లా తగాదా తప్పలేదు.

ఇచ్చట అరబ్బుల వాదాన్ని ఈవిధంగా కుదించి చెప్పవచ్చు. అకాబా అఖాతానికి సంబంధించినంతవరకు ఇజ్రాయల్‌కు అచ్చట స్థానంలేదు. ఆ సముద్రంమీద వున్న దేశాలలో ఆదేశం ఒక్కటికాదు. ఆ ప్రాంతాన్ని ఇస్రాయల్ బలవంతంగా, దురాక్రమణచేత, 1947లో సమితిచేసివున్న ఏర్పాట్లను అతిక్రమించి, ఉల్లంఘించి ఆక్రమించుకుంది. ఈలీత్‌రేవు సంగతికూడా అంతే. ఇట్లా వుంటుంది అరబ్బులవాదం. కాని ఇది ఎంత వరకు నిలిచేవాదమో చెప్పలేము. సమితి పంపిణీ పథకంక్రింద నెగెవ్ ఎడారిలో చాలాభాగం ఇస్రాయల్‌కు కేటాయించబడింది. నెగెవ్ ఎడారిని ఆనుకునే అకాబా అఖాతంవుంది. ఈ ప్రాంతాన్ని ఈవిధంగా ఇస్రాయల్‌కు కేటాయించడం ఎర్రసముద్రానికి ఆదేశం నౌకలకు దారిచూపించడానికే అన్నది నిర్వివాదమైన విషయం.

ఈ అఖాతాన్ని బంధించడంలో శ్రీ నాసర్ ఆలోచన చాలా లోతైనట్టిదని చెప్పవలసి వుంది. ఆయన ఆ దిగ్బంధనం విధించిన నాటికి ఇంకా

జోర్డాన్‌తో రక్షణ ఒప్పందం కుదరలేదు. ఆతర్వాత కుదిరింది. ఆ టిరాన్ జలసంధిలోంచి నౌకలు రావడం ఇస్రాయల్‌కు ఎంత అవసరమో, జోర్డాన్‌కుగూడా అంతే అవసరం. అవసరంలో వున్న తీవ్రతను గ్రహించి నప్పుడుగాని శ్రీ నాసర్ ఎత్తుగడలోని లోతు మనస్సుకురాదు.

టిరాన్ జలసంధిని ఏరోజున శ్రీ నాసర్ దిగ్బంధంచేశారో, ఆరోజునే నిజానికి యుద్ధం ఆరంభమైనట్లు చెప్పవలసి వుంటుంది. అయితే మే నెలలో చివరి పక్షం అంతా అమెరికా మొదలైన రాజ్యాలు ఆ జలసంధి విషయం ఏమిచెయ్యాలా అని ఆలోచన చేశాయి. ఆ ఆలోచనలు ఇటు ఈజిప్టుకు నచ్చలేదు; అటు ఇస్రాయల్‌కు నచ్చలేదు. ఆఖరికి ఒక్క రోజున ఇస్రాయల్ రక్షణ మంత్రి జనరల్ మోషే డయాన్ "ఇక మేము ఒంటరిగా ఏదోఒకటి చేసుకోక తప్పదు" అన్నారు.

## 2

ఇట్లా ఆరబ్‌రాజ్యాలు, ఇస్రాయల్‌ల మధ్య వున్న తగాదాలే ఇప్పటి ఈ యుద్ధానికి దారితీశాయా? లేక ఇంకా ఇతరమైన కారణాలు ఏమన్నా వున్నాయా? కొంతమంది విషయజ్ఞులైనవారు ఈ యుద్ధంలో ఇంకా వేరేకారణాలుగూడా వుండి వున్నాయంటున్నారు. అగ్రరాజ్యాలమధ్యతగాదాలకు ఇచ్చట ఈ యుద్ధప్రజ్వలనానికి సంబంధం వున్నదంటున్నారు. వియత్నాంలో సాగుతున్న యుద్ధానికి ఇచ్చట ఈ యుద్ధం బయలుదేరిన ముందు పరిస్థితికి ముడి వున్నదంటున్నారు. అమెరికా యేమో వియత్నాం యుద్ధంలో ఉత్తరవియత్నాంను నానాబాధలు పెడుతున్నది. ఉత్తరవియత్నాంకు ఆయుధాలు మొదలైనవి సరఫరాచేయడం తప్ప మరోరకమైన సహాయాన్ని రష్యా చేయలేకపోతున్నది. దక్షిణవియత్నాంకు అండగా అమెరికాయేగాక మరికొన్ని దేశాలుగూడా వియత్నాంలో తమ సైన్యాలను దింపి పోరాటం సాగిస్తున్నాయి. ఉత్తరవియత్నాం అచ్చట పోరాటాన్ని సాగిస్తున్నా ఆ ఒత్తిడిని ఆ రాజ్యం తట్టుకొనడం కష్టం అవుతున్న లక్షణాలు కన్పిస్తున్నాయి. అచ్చటినుండి అమెరికా దృష్టిని కొంతవరకు మళ్లిస్తే, ఆ ప్రాంతానికి దూరంగా, అమెరికాకు అత్యంతమైన ఆసక్తిగల ఈ ప్రాంతంలో ఉద్రేకాలను రెచ్చగొడితే, అది కొంతచేసినట్లు అవుతుంది. రష్యా యీ రకమైన ఆలోచనతో శ్రీ నాసర్‌ను రెచ్చకొట్టింది అని ఈ విషయజ్ఞులు అంటున్నారు. ఇది అంతా నిజంకావచ్చు నిజం కాకపోవచ్చు. కాని మధ్యప్రాచ్యంలో ఉద్రేకాలు ఈ విధంగా పెల్లుబకడానికి రష్యా బాధ్యతలేదని అనలేము. సిరియాకు ఆయుధాలు ఇవ్వడము, ఈజిప్టుకు ఆయుధాలు సమకూర్చడముద్వారా, ఆ ప్రాంతాలలో ఆర్థికాభివృద్ధికికన్నా యుద్ధోన్మాదవిజృంభణకే రష్యా ఎక్కువగా తోడ్పడింది. రష్యా ఈ ఆయుధాలను ఆరబ్ రాజ్యాలకు అన్నింటికి సమకూర్చలేదు. కొన్నింటికి మాత్రమే, "ప్రోగ్రసీవ్" రాజ్యాలని తాను భావిస్తూ వున్న రాజ్యాలకుమాత్రమే, సమకూర్చి వుండటం గమనార్హం. ఇప్పుడు యుద్ధానంతరం రష్యా నాయకులు ఆరబ్‌రాజ్యాలతో మంతనాలు సాగిస్తూవున్నా, ఆ మంతనాలు కొన్ని ఆరబ్‌రాజ్యాలతోమాత్రమే సాగింపబడుతూ వుండటంగూడా ఇచ్చట గమనించవలసివుంది. అంటే ఇస్రాయల్‌మీద ఆరబ్‌రాజ్యాలకు సమష్టిగావున్న ద్వేషాన్నేగాక, ఆరబ్‌రాజ్యాలలో ఆరబ్‌రాజ్యాలకు వుండుకున్న తగాదాలనుగూడా రష్యా తన స్వప్రయోజన సాధనకు అనుకూలంగా ఉపయోగించుకుంటున్నది. ఇట్లా అని, కొన్ని ఆరబ్‌రాజ్యాలు రష్యాను తమ ప్రయోజనాలను సాధించుకోడానికి ఉపయోగించుకోగలమని అనుకోలేకపోలేదు. అసలు ఆరబ్ రాజ్యాలను తన ప్రయోజనాలకు ఉపయోగించుకుందామని రష్యా చేసిన ప్రయత్నానికి, తమ ప్రయోజనాల సాధనకు రష్యాను ఉపయోగించుకోగలమన్న కొన్ని ఆరబ్‌రాజ్యాల ధీమాకు మధ్య తటస్థమైన ఆహమహమికయే ఉద్రేక విపరీతం అయివున్న మధ్యప్రాచ్యాన్ని యుద్ధజ్వాలలలోనికి త్రోసిందేమో అనిగూడా అనిపిస్తుంది.

మధ్యప్రాచ్యంలో ఎంతమేరకు ఈ ఆరబ్ రాజ్యాలను రష్యన్‌లు తమ ప్రయోజనాల నిమిత్తం ఉపయోగించుకుందామనుకున్నారో చెప్పలేము. యుద్ధాన్ని తెచ్చిపెట్టి, అచ్చట తమకు అనుకూలమైన పరిస్థితి సృష్టించుకుందామనుకున్నారా! తామేమో కొన్ని ఆరబ్ రాజ్యాలకు అత్యంత ఆధునాతనమైన ఆయుధాలను సమకూర్చి వుండటం జరిగిపోయింది. ఇజ్రాయల్ కూడా ఆయుధాలను సమకూర్చుకొని వున్నా, ఆ దేశం ఒక్క దేశం, ఆరబ్‌రాజ్యాలు అనేకం.

ఆరబ్ రాజ్యాల అన్నింటి బలాలు ఇస్రాయల్ బలాల కన్నా కొన్నిరెట్లు ఎక్కువగా వున్నాయి. సిరియా సైన్యము, ఈజిప్టు సైన్యము రష్యాచేత శిక్షింప బడినాయి. ఈ పరిస్థితిలో ఆరబ్‌రాజ్యాలన్నీ కలిసి—వారిమధ్య తగాదాలు ఎట్లావున్నా - ఇప్పుడు ఇస్రాయల్‌ను ఓడిస్తే ఓడించవచ్చు. యుద్ధం ప్రారంభం కావడానికి ముందు శ్రీ నాసర్ ఉపన్యాసధోరణి అంతా ఆ పద్ధతిలోనే నడిచికూడా వుంది. కాని జరిగిన యదార్థ విషయాలను బట్టిచూస్తే, మధ్య ప్రాచ్యంలో పరిస్థితిని యుద్ధందాకా రేచ్చ గొట్టకుండా, యుద్ధం వచ్చే పరిస్థితి దాకాతెచ్చి, ఆపరిస్థితిలో తన రాజకీయాన్ని ప్రదర్శించాలని రష్యా ఆశించివున్నదని చెప్పడానికి తగినంత ఆస్కారంవుంది. అదేవిధంగా ఇస్రాయల్‌ను గూడా అమెరికా హద్దుల్లోపెడుతుందని, అప్పుడు అట్లా ఏర్పడిన పరిస్థితిలో మధ్యప్రాచ్యాన్ని వియత్నాంను లగింపుచేసి చర్చించవచ్చునని అటు రష్యా, ఇటు అమెరికాగూడా అనుకొనివుండవచ్చు. కాని ఎవరు ఎట్లా అనుకున్నా, అనుకున్నదిమాత్రం జరగలేదు. యుద్ధమే ప్రారంభం అయింది.

ఆరబ్‌రాజ్యాల దృష్టినుంచి చూస్తే అప్పుడు ఈ యుద్ధానికి మరికొన్ని కారణాలు కన్పిస్తాయి. 1956 లో ఈజిప్టుమీద బ్రిటను, ఫ్రాన్సు, ఇస్రాయల్‌లు కలిసి సాగించినదాడి సంగతిని అట్లా వుంచినా, 1948 లో ఆరబ్ రాజ్యాలు ఇస్రాయల్ చేతుల్లో దెబ్బతిన్నాయి. ఆ దేశాన్ని నామరూపరహితం చేద్దామన్నంత దీక్షతో ఆరబ్‌రాజ్యాలు అప్పుడు కృషిచేశాయిగాని లాభంలేకపోయింది. 1949 లో ఆర్మిస్టిస్‌కు అంగీకరించవలసి వచ్చింది. 1956 లో జరిగిన సంగతులు చెప్పనే అక్కరలేదు. ఆ యుద్ధంలోనే ఇస్రాయల్ టిరాన్‌ను పట్టుకుంది. షెర్మ్—ఆల్—షేక్‌కు వచ్చి కూర్చుంది. అకాబా మీదుగా నిరాఘాటంగా నౌకలను నడిపించుకునే స్వామ్యమును సంపాయించుకుంది. ఆ తర్వాత నెగివ్ ప్రాంతంలో బ్రహ్మాండమైన పనులు జరిగాయి. ఈలీత్‌నుంచి హైఫాకు మానెగొట్టాలు పడ్డాయి. అకాబా అఖాతాన్ని, మధ్యధరాసముద్రాన్ని కల్పుతూ ఒక కాలువ త్రవ్వాలన్న పథకాన్నిగూడా ఇస్రాయల్ వేసుకుకూర్చుంది. అంటే, మధ్యధరా సముద్రానికి, ఎర్రసముద్రానికి ఇప్పుడు వున్న సూయజ్ కాలువ వంటిదారిని ఇంకోదాన్ని సృష్టించేయడానికి ఇస్రాయల్ తలపెట్టింది.

తక్కిన ఆరబ్‌దేశాల సంగతి ఎట్లావున్నా, ఇస్రాయల్ చేస్తున్న పనులలో ఏదీ ఈజిప్టుకు నచ్చేది లేదు. ఇక తక్కిన ఆరబ్ రాజ్యాలు వున్నాయంటే, ఈజిప్టులాగానే, వానికిగూడా ఇస్రాయల్ ఉనికి గిట్టదు. అసలు ఇస్రాయల్ అనే రాజ్యం యీ భూమి మీద వుండకూడదనే దృష్టితో ఈ రాజ్యాలన్నీ వున్నాయి. ఇది కొత్తవిషయంకాదు. ఇస్రాయల్ అంటూ ఒక రాజ్యంగా ఏర్పడబోతున్నప్పుడు, తీరా ఆ రాజ్యం ఏర్పడినప్పుడు, ఆ తర్వాత ఆ రాజ్యం ఏర్పడి నడుస్తూ వున్నప్పుడుగుడా ఇదే అభిప్రాయంతో ఆరబ్‌రాజ్యాలు వుంటూ వచ్చాయి; వున్నాయి. అందులో దాపరికం ఏమీలేదు.

## 3

1947 లో పాలస్తీనాను యూదులకు, అరబ్బులకు పంచిపెట్టడానికి సమితి నిర్ణయించినప్పుడు అరబ్బులు ఆ పథకాన్ని ఆమోదించలేదు. యూదులు ఆమోదించారు. 1948 లో యూదులరాజ్యం —ఇస్రాయల్— ఏర్పడింది. ఇది మూడవసారి యూదురాజ్యం ఏర్పడటం. మొదటి రాజ్యాన్ని బాబిలోనియన్‌లు ఇప్పటికి దాదాపు 2500 సంవత్సరాలక్రిందట నాశనం చేశారు. ఆతర్వాత బాబిలోన్ దాస్యంలోంచి విముక్తిని సాధించుకొని తిరిగి యూదులు—తమరాజ్యాన్ని -ఇజ్రాయల్‌ను స్థాపించుకున్నారు. ఆరాజ్యాన్ని క్రీ॥ శ॥ 70 లో టైటస్ నాశనం చేశాడు. ఆ సంవత్సరంలోనే యూదుల దేవాలయంగూడా నాశనం చేయబడింది. యూదులు స్వాంతరాజ్యం అంటూ లేకుండా ప్రపంచమంతటా అన్ని రాజ్యాలలోను రెండువేల ఏళ్లపాటు క్రుమ్మరిల్లారు. ఆ క్రుమ్మరిల్లిన యూదులకు ఒక స్థిరమైన ఇంటిపట్టు, ఒకరాజ్యం అంటూ ఇప్పుడు ఏర్పడ్డాయి. సమితి ధర్మమాఅని ఈ రాజ్యం ఏర్పడింది. అంటే ప్రపంచ రాజ్యాలన్నీ కలిసి ఈ రాజ్యాన్ని ఏర్పాటుచేశాయి. అధిక సంఖ్యాకమైన రాజ్యాలు ఆ రాజ్యాన్ని గుర్తించాయి. ఆరబ్‌రాజ్యాలు, మరికొన్ని రాజ్యాలు గుర్తించనంతమాత్రంచేత ఆ రాజ్యానికి రాజ్యస్థితి లేకుండాపోవడం లేదు. ఈ విష

యాన్ని అరబ్ రాజ్యాలు గుర్తించకపోవడానికి అనేక కారణాలు వుండవచ్చు. కాని సమితి చేసిన ఆ పంపిణీ ఏర్పాటుప్రకారం పాలస్తీనా అనబడివున్న ప్రాంతంలో ఈ యూదు రాజ్యంతోపాటు ఒక అరబ్ రాజ్యం గూడా ఏర్పడవలసివుంది. కాని అది అట్లా జరిగినట్లు కన్పించదు. 1948 లో ఇస్రాయల్ ఏర్పడ గానే ఆ రాజ్యంతో యుద్ధం ప్రారంభం చేయబడింది. ఇప్పటికి 20 సంవత్సరాలుగా ఈ మధ్యప్రాచ్యంలో— యుద్ధముకాని, శాంతిలేని ఒక విచిత్రమైన పరిస్థితి చెల్లుబడి అవుతూవస్తున్నది. ఇస్రాలీలు పాలస్తీనాలో ప్రవేశించిన దగ్గరనుంచీ తాము అధినివేశాలు ఏర్పాటు చేసుకున్న ప్రాంతాలలో బ్రహ్మాండమైన అభివృద్ధిని సాధిస్తూవచ్చారు. అత్యధునాతనమైన వస్తూత్పత్తి పద్ధతులను ప్రవేశపెట్టారు. ఎడారులలో బంగారం పండించారు. ఇది అరబ్ లలో ఒక రకమైన విచిత్ర మనస్స్థితిని కల్పించిందని వాదించినవారు వున్నారు. 1947, 1948 సంవత్సరాలలో సమితిలో జరిగిన చర్చలలో ఇటువంటి వాదం విన్పించక పోలేదు. పాలస్తీనా అంతా అరబ్బులది గనుక, అక్కడ ఇస్రాయల్ కు ఒక రాజ్యంగా స్థానమే లేదని అరబ్బుల వాదం. ఇట్లా అనడం ఎందుచేతనంటే, యూదు లతోకూడా పాలస్తీనాను ఏకరాజ్యంగా ఏర్పాటుచేయ డానికి అరబ్బులు అంగీకరించివున్నారు. కాని ప్రత్యేక యూదురాజ్యాన్ని మాత్రమే అంగీకరించడంలేదు.

ఇందుకు కారణం ఏమైవుంటుంది? అని ఆలోచించిన కొందరు మేధావులు ఇట్లా భావి స్తున్నారు. అరబ్ రాజ్యాలన్నీ ఇస్లాము రాజ్యాలు. తక్కిన మతాలలో వచ్చినట్లు ఆ మతంలో విప్లవం రాలేదు. సాంస్కృతికంగా ఆ మతం పెంపుచెందలేదు. పరివర్తన చ్ఛాయలు ఆ మతంలో సోకలేదు. అందు చేత ముస్లిం రాజ్యాలు, అధునాతనమైన ప్రపం చంలో ఉనికికొని వుండికూడా అధునాతన రాజ్యస్థితి అందుకోలేకపోతున్నాయి. అంటే ఇస్రాయల్ కు, అరబ్ రాజ్యాలకుమధ్య సాంస్కృతికంగా పెద్దఅఖాతం అంతా తేడావుంది. ఈ తేడాయే ఇస్రాయల్ నుచూస్తే అరబ్ రాజ్యాలకు గిట్టకుండా చేస్తున్నది.

ఇట్లా ఈ మేధావులు అనడానికి కారణాలు లేకపోలేదు. అరబ్ రాజ్యాలలో గూడా యూదులు వున్నారు. వారిని అచ్చట అరబ్ లు నిర్దాక్షిణ్యంగా చూడటంలేదు. క్రైస్తవులు యూదులను చూస్తున్న దానికన్నా ఎక్కువ సహనంతో చూస్తు న్నారు. వారితో వారికి పడకపోవడం అంటూలేదు. వారికి పడనిది ఒక్క ఇజ్రాయల్ తోనే— యూదురాజ్యంతోనే—. అందుకు వారికి వారికిమధ్య కన్పిస్తూవున్న సంస్కృతి సంబంధమైన ఈ అఖాతమువంటి తేడాతప్ప ఇంకో కారణంకన్పించదు. అరబ్ భూభాగాలతో పోలిస్తే ఇజ్రా యల్ వైశాల్యం ఎంత ? అత్యల్పం. 1/50 వంతు. జనాభాచేత గూడా ఇస్రాయల్ ను అరబ్ రాజ్యాలజనాభాతో పోలిస్తే అల్పాతి అల్పం. మరి అట్టి ఆ రాజ్యం అత్యంతము అధునాతనమైందిగా వుంది. అరబ్ లకు గూడా తమ రాజ్యాలను అట్లా అధునాతన స్థితికి తీసుకురావాలని వుంది. కాని వారికి అది ఇంకా సాధ్యం అయిరావడంలేదు. ఇస్రాయల్ —అల్ప వైశాల్యంగల ఇజ్రాయల్— అటువంటి అధునాతన రాజ్యం అయికూర్చుంది. ఇది వారితో వారికి తెలియ కుండానే ఇస్రాయల్ పట్ల ఒకవిధమైన ద్వేషాన్ని సృష్టిస్తూ వున్నదని ఈ మేధావులు 'అంటున్నారు. ఆ ద్వేషంలో ఇస్రాయల్ ను నాశనం చెయ్యాలన్న పట్టుతో పనిచేస్తున్నారు. ఇందులో కొంత ఎత్తుగడ వుండవచ్చు; కొంత యదార్థ్యం వుండవచ్చు. ఏమైనా వారి వైఖరి పైకి ఇస్రాయల్ ఉనికి పనికిరాదన్నం తగా వుంటున్నది.

## 4

యుద్ధం ఇంకో 24 గంటలలో ప్రారంభం కాబో తున్నదనగా శ్రీ నాసర్ ఇట్లా ఒక ప్రకటన చేశారు. "1956 లో ఇస్రాయల్ జరిపిన అత్యాచారానికి ప్రతిక్రియ జరపడానికి ఎప్పుడు యుద్ధం వస్తుందా అని నిరీక్షిస్తున్నాము". ఒక సందర్భములో ఆయన ఇస్రాయల్ ను నామరూపరహితం చేయడం గూడా అరబ్బుల లక్ష్యం అన్నట్లు విశదం చేసివున్నారు. అయితే యుద్ధాన్ని ముందు ఇస్రాయల్ ప్రారభం చేసేట్లు చెయ్యాలా ? లేక ముందే అరబ్బులు ఇస్రాయల్ మీద దెబ్బతియ్యాలా అన్న సమస్య గూడా అచ్చట వచ్చినట్లు తోస్తుంది. యుద్ధం అయిపోయిన తర్వాత శ్రీ నాసర్ రాజీనామా ఇవ్వడానికి సంకల్పించుకొని చేసిన ప్రకటనలో రష్యా ఈజిప్టును మొదటి దెబ్బ కొట్టకుండా ఆపింది-- అన్నారు.

నిజమే. కాని దీన్నిబట్టి ఒక్క విషయం వ్యక్తం అవడంలేదా? ఇస్రాయల్‌మీద పడటానికి ఈజిప్టు సర్వము సిద్ధంచేసుకొనివున్నదని రష్యాకు అనిపించక పోతే, ఎందుకు ఆపుతుంది. జూన్ 3 న అప్పటి ఈజిప్టు సర్వసేనాని ఫీల్డుమార్షల్ అబ్దుల్ హకీమ్ అమీర్ మాట్లాడుతూ ఇస్రాయల్ సరిహద్దుల్లో తమ సైన్యాలు సర్వసన్నద్ధంగా వున్నాయి అన్నారు. అంటే ఇస్రాయల్‌పై గట్టిదెబ్బతీయడానికి ఈజిప్టు పూర్తిసన్నాహం వేసుకున్నదనేగదా అర్థం!

ఇట్లా జరక్కపోతే, ఏమి చెయ్యడమోగూడా ఈజిప్టు ఆలోచించుకునే వుంది. మే 26 న ''అల్ అహ్రాం'' సంపాదకుడు తమ పత్రికలో ఇట్లా వ్రాశారు: 'ఈ వారంలో అకాబా అఖాతం బంధింప బడింది. ఇప్పుడు దానిని అరబ్ సైన్యాలు సంరక్షిస్తున్నాయి. ఇస్రాయల్ కు ఇది చాలా ప్రమాద భరితమైన పరిస్థితి. ఈ పరిస్థితిని ఇస్రాయల్ సహించలేదు. తుష్ణీం భావాన్ని వహించి వూరుకోలేదు. ఏదో సమాధానం ఇవ్వాలి. అప్పుడు మేము దెబ్బ తీస్తాయి. ఆ దెబ్బ వట్టిదెబ్బ కాదు. చావుదెబ్బ''—దీనినిబట్టి ఈ వ్యవహారంలో అటు ఇటు గూడా వ్యవహరించడానికి, ఎటుపడితే అటుగా వాదం చెయ్యడానికి వీలుగా సర్వమైన పరిస్థితిని యుద్ధానికి ఉన్ముఖంగా ఈజిప్టు సంసిద్ధంచేసి వుంచుకున్నదని, ఇస్రాయల్‌ను యుద్ధంలోనికి రెచ్చగొట్టడానికి కృతనిశ్చయమైపోయిందని విదితం అవుతూనే వుంది.

ఈ యుద్ధాన్ని తెచ్చిపెట్టడంలో సిరియా చాలా ప్రధానమైన భూమికనునిర్వహించింది. అయితే ఆపనిని సిరియా స్వయంగా చేసిందా, లేక రష్యా ప్రోద్బలం అందుకు కొంత వున్నదా అన్నదికూడా ఆలోచించవలసిన విషయమే. సిరియాలో బాత్‌పార్టీ అతివాదుల ప్రభుత్వం ఏర్పాటు అయిన దగ్గరనుంచీ ఆదేశం ఇస్రాయల్‌పై ఔద్ధత్యం నెరపుతూనే వచ్చింది. సిరియన్ గెరిల్లాలు ఇస్రాయల్‌ను బాధిస్తూ వచ్చారు. శతఘ్నులుకూడా ఉపయోగించారు. ఈసంవత్సరం ఏప్రిల్‌లో ఇస్రాయల్ సిరియాపై చేయిచేసుకున్నది. విమానాలతో దెబ్బతీసింది. అంతకుముందు రష్యా విదేశాంగమంత్రి శ్రీ గ్రోమికో కెయిరోకు వచ్చి వెళ్ళారు. ప్రఖ్యాత రాజకీయ వ్యాఖ్యాత శ్రీ విక్టర్‌జోర్జ 'గార్డియన్' పత్రికలో వ్రాసినదాన్నిబట్టి చూస్తే శ్రీ గ్రోమికో ఆ కెయిరో యాత్రలోనే ఈ జరిగిన యుద్ధానికి బీజావాపం జరిగినట్లు గూడా భావించే వాళ్లువున్నారని తెలుస్తుంది. ఏమైనా శ్రీగ్రోమికో కెయిరోకువచ్చివెళ్ళిన అనంతరంఇస్రాయల్ ఆదాడిజరిపింది. ఆరు సిరియన్ విమానాలను పడగొట్టింది. సిరియా విూద ఇట్లా లేస్తూవుంటే తాను సహించేదిలేదని రష్యా ఇస్రాయల్‌ను హెచ్చరించింది. ఇస్రాయల్ సరిహద్దులను సిరియా అధికంగా బాధ పెట్టడం మొదలు పెట్టింది. ఒక సందర్భంలో ఇస్రాయల్, సిరియాను గట్టిగా గూడా హెచ్చరించివుంది. కాబట్టి ఇప్పుడు జూన్‌లో జరిగిన ఈ యుద్ధం అవ్వాళ్లే, అనగా జూన్ 5 వ తారీఖువాడే ప్రారంభం కాలేదు. అంతకు ఎంతోముందే, ఆ యుద్ధం ప్రారంభం కావడానికి కావలసిన కారణాలన్నీ సమకూర్చబడినాయి.

జూన్ ఐదున ప్రారంభమైన యుద్ధం పట్టుమని ఆరురోజులుగూడా సరిగ్గా జరగలేదు. ఆ ఆరు రోజుల్లో అరబ్‌రాజ్యాలు తిరిగి ఇంకోసారి ఇస్రాయల్ చేతుల్లో ఓడిపోయాయి. ఈసారి ఇస్రాయల్ సినాయ్ ద్వీపకల్పంలో అధికభాగాన్ని ఆక్రమించుకున్నది. గాజా ప్రాంతాన్ని పట్టుకున్నది. సూయజ్‌దగ్గర తిష్ఠవేసింది. జెరూసలెంను ఏకంచేసింది. జోర్డాన్ ఆవలిగట్టు ఎక్కింది. సిరియాలో కునైత్రా దాకా వెళ్లి కూర్చుంది. ఆ ప్రాంతాలలో అట్లాగే ఇస్రాయల్ కూర్చుంటుందా! గతంలో ఇస్రాయల్, అరబ్బులు మధ్యజరిగిన యుద్ధాలను, ఆ యుద్ధాలఅనంతరంజరిగినఏర్పాట్లనుబట్టిచూస్తే ఇస్రాయల్ ఆ అన్నిప్రాంతాలలో పూర్తిగా తిష్టవేసుకు కూర్చోకపోయినా, తనకు, తన సరిహద్దులకు శాశ్వతమైన భద్రతను చేకూర్చుకొని, శాంతియుతంగా సాధ్యమైనంతవరకు జీవనాన్ని గడపడానికి ప్రయత్నం చేస్తుందని మాత్రం చెప్పవచ్చు. ఈ స్థితి ఏర్పడటం అన్నది ఒక్క ఇజ్రాయల్‌మీదనేగాక, అగ్రరాజ్యాల మీద, ముఖ్యంగా రష్యా అమెరికాలమీద, అరబ్‌రాజ్యాల మీద, ఆధారపడి వుంది.

---

## కలగూరగంప:

# శ్రీనాథుని దండకములు

భారతీయ కావ్య ప్రపంచము చతుర్విధ పురుషార్థ సాధకము. కావ్యము ప్రేయస్సును గూడ సాధించిపెట్టుననియే సాహిత్యశాస్త్ర మతము. కావ్య ప్రయోజనములలో మమ్మటాచార్యుడు 'శివేతరక్షతిని' గూడ పేర్కొనుట ఈ మతమునే బలపరుచును. ప్రప్రథమ కావ్యమునుండియు నీ లక్షణము సర్వత్ర గోచరించుచునే యున్నది.

కథా సందర్భమును బట్టి చెప్పబడిన కొన్ని స్తోత్రములు స్వతంత్రముగా కూడ వ్యాప్తి నొంది కనిపించును. దీనికి కారణము భక్త హృదయము. భాగవతములోని 'లా వొక్కింతయు లేదు' మున్నగు పద్యములు సాంసారిక జీవితములో ప్రతిధ్వనించుచున్నట్లు, కావ్యగత స్తోత్రములు స్వతంత్ర పారాయణ పాత్రములై ప్రతిధ్వనించును. ఇక్కడ కావ్యగత వ్యక్తి తోడి తాదాత్మ్యమును లౌకిక వ్యక్తి తత్కాలమున సాధించుకొనుటకు యత్నించును. సంస్కృతమునందలి పెక్కు వర్ణనములు, తెలుగునందలి పెక్కు స్తోత్రములు—ఈ విధమగు ప్రయుక్తిని సంపాదించుకొన్నవి. తెలుగు కావ్యములలోని దండకములు కూడ ఈ కోవకు చెందినవే. స్వతంత్రములైన దండకము లనేకములు సాహిత్యలోకమున, భక్తలోకమున వ్యాప్తి నొంది యున్నవి. దండకమునే ప్రత్యేక సాహిత్య ప్రక్రియగా గ్రహించి భక్తిరసమునకు మాత్రమే కాక, శృంగార హాస్య రసములకు కూడ వినియోగించుకొన్నవారు కూడ కలరు. వాని మాట యటుంతము.

తెలుగు కావ్యమున నన్నపార్యుడు తొలిసారిగా దండకమును ప్రవేశపెట్టెను. ఆ పిమ్మట మారన, ఎఱ్ఱాప్రెగ్గడ, కొఱవి గోపరాజు, పోతన ప్రభృతులును వాడిరి. శ్రీనాథుడు తన గ్రంథములలో నైదు మారులు దండకమును వాడెను. అందరు నొకేవిధముగా వ్రాయక, యొకే లక్షణము ననుసరింపక, తమతమ విలక్షణతను నిరూపించుకొనిరి. ఆ తరువాత కూడ దండకమును కావ్యనిబద్ధము చేసిన కవులున్నారు కాని, శ్రీనాథుని విశేషములను గుర్తించుటయే యిచ్చటి విషయము కావున తత్పూర్వవర్తులైన కవులుమాత్రమే అపేక్షణీయులు.

నన్నయభట్టు ఆరణ్యపర్వమునందు దండకమును రచించెను. ఈశ్వరుడు పాశుపతాస్త్ర సంపాదన దీక్షాదక్షుడైన యర్జునుని పరీక్షించెను. అర్జునుడు పరీక్షయందు విజయమును సంపాదించుకొనెను. అప్పుడు విరూపాక్షుడు పార్థునకు దివ్యదృష్టి ననుగ్రహించెను. ఈశ్వరుని దివ్యస్వరూపమును జూచిన పార్థుడు దండకము నాశ్రయించి స్తవము గావించెను—

"శ్రీకంఠ లోకేశ లోకోద్భవస్థాన సంహారకారీ మురారిప్రియా చంద్రధారీ మహేంద్రాది బృందారకానంద సందోహ సంధాయి పుణ్యస్వరూపా విరూపాక్ష దక్షాధ్వరధ్వంసకా దేవ.........నాకు నభ్యర్థితంబుల్ ప్రసాదింపు కారుణ్యమూర్తీ త్రిలోకైకనాథా నమస్తే నమస్తే నమః"

ఈ దండకమునందు వరుసగా తగణములుండి చివరనొక గురువు చేరినది. యమకము, అనుప్రాసము ధారాళముగానుండి గతి సౌందర్యమును గలిగించుచున్నవి. అంతమున 'నమస్తే నమస్తే నమః' యనుట ఆవేశసుందరమైన స్తోత్రమును పరాకాష్ఠకు తీసికొనిపోయి, నమస్కార రూపమైన హృదయసంధానముగా పర్యవసానము నొందుచున్నది. నిరంతరము, సమాంతరమునైన గతి భక్త్యావేశమునకు లవలేశమైన నవరోధము కాక క్రమ క్రమౌన్నత్యమునకు గారణమగును.

మారన తన మార్కండేయ పురాణమునందు నారాయణీ స్తవమును దండక రూపమున రచించెను. శుంభుని సంహరించిన చండికను దేవతలు స్తుతించు ఘట్టములోనిది —

'శ్రీవిష్ణుశక్తీ! జగన్మూలశక్తీ! త్రిశక్తీ! మహాశక్తీ! నారాయణీ! దేవి! మా మ్రొక్కుగైకొమ్ము కాష్ఠాది కాలస్వరూపంబులం జేసి పాకంబు గావించి లోకంబులన్ మ్రింగు నారాయణీ! దేవి! మా మ్రొక్కు గైకొమ్ము సర్గ స్థితి ధ్వంసనంబు ల్పొనర్పన్నిమిత్తంబ! త్రైగుణ్యమూర్తీ! జగద్గీత సత్కీర్తి! నారాయణీ! దేవి! మా మ్రొక్కు గైకొమ్ము.

మున్నగు విధముగా రచన సాగినది. పండ్రెండు మారులు 'నారాయణీ! దేవి! మా మ్రొక్కు గైకొమ్ము' అను వాక్యము ఆవృత్తి నొందినది. పిమ్మట 'సర్వరూపా! మహాదుర్గ! మా మ్రొక్కు గైకొమ్ము' అని సంబోధనల మార్పుతో నొకమారు ఆవృత్తి కలిగినది. చివరకు వచ్చుసరికి—

'ఏ ప్రొద్దు దేవీ! నిను న్భక్తి సేవించు సద్భక్త సంఘంబు లెన్నండు నే దుఃఖము ల్పొందకే బాధలం జెంద కానందలీలన్ సుఖంబుండఁ గాంచున్ సమస్తైక భద్రా! సమస్తైక పుణ్యా! నమస్తే నమస్తే నమః.'

అని ముగిసినది. ఇదియు తగణ ఘటితమై, చివర నొక గురువును కలుపుకొన్నది. నడుమనున్న యావృత్తి పాటలో పల్లవివలె ప్రవర్తించును. ఆవృత్తికి నావృత్తికి నడుమనున్న దూరము మారుచు వచ్చినది. చివర నొందబోవు ననుభూతికి ఈ యావృత్తులు సోపానములై సహకరించుచున్నట్లు గోచరించును.

ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన నృసింహ పురాణము నందున్న లక్ష్మీనృసింహ దండకము కొంచెము పెద్దది గనే యున్నది. నృసింహమూర్తి హిరణ్యకశిపుని సంహరించినపిమ్మట లోచనత్రయముతో, దివ్య తేజముతో వెలుగొందుచుండును. అట్టి యెడల దేవతలును, మునులును భక్తిభావపరీత చేతసులై నృసింహుని స్తుతింతురు—

"శ్రీనాథ నాథా జగన్నాథ నమ్రైకరక్షా సమక్షా సరోజాక్ష సర్వాభివంద్యా మహానంద గోవింద నీ వెందు నీ విశ్వదృశ్యప్రపంచంబునన్ నిండి యొండొండ యంతర్బహిర్వ్యాప్తి శోభిల్లు నందంబు చిందమ్ములై ప్రోసి తేల్పన్ బరానంద కందమ్ము లామ్నాయ బృందమ్ము లిట్లున్న నీయున్న.........యీ భవ్య దివ్యావతారోదయస్ఫూర్తి నాపూర్తమై యొప్పు నీ యొప్పు మమ్మెప్డు రక్షించు లక్ష్మీశ యీశా నృసింహా నమస్తే నమస్తే నమస్తే నమః"

అను ప్రాసయు, అంత్య ప్రాసయు నిందు అధికాధికముగా కానవచ్చుచున్నవి. చిట్ట చివర ఈవర కున్నట్లు నమశ్శబ్దము మూడు మారులు కాక, నాలుగవసారి కూడ ప్రయుక్తమైనది. నడుమ నేవిధమైన యవరోధము లేకుండ నిత్య స్రోతస్విని వలె సాగినది.

ఇంతవరకు చూచిన దండకములందు ప్రారంభమున శ్రీకారము నియతముగా ప్రయుక్తమైనది. తగణములతోనే చివరంట సాగి, గురువుతో ముగియుట; నమశ్శబ్దమును మూడుమారులుగాని, నాలుగు మారులుగాని వాడుట యవశ్య లక్షణములుగా ననిపించును.

కొఱవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికయందు మఱొక మార్గమును ద్రొక్కెను. తాను సగణ నగణము లతో ప్రారంభించి,ఆపిమ్మట రగణములనుచివరంట వాడు కొనెను. ఈ నిర్ణయమునుబట్టి తొలుత శ్రీకారము నుప యోగించు నవకాశము లేకపోయినది. అందువలన, తత్సదృశముగా జయశబ్దమును వాడుకొనెను.

"అమరంగ సనహంబులం దాదిగా నొండెఁ గాదేని నాదిన్ దకారంబుగా నొండె లోనం దకారమ్ము లిమ్మైగకారావసానంబుగాఁ జెప్పినన్ దండకం బండ్రు" అను కవిజనాశ్రయ మతానుసారముగా నీరచన సాగినది. సనహలపై తగణములను నిల్పి గుర్వంతము చేయుట యన్నను సనలపై రగణములను నిల్పుట యన్నను నొక్కటే.

ధనదుడు ద్వారావతి యందున్న కృష్ణుని దర్శించి స్తోత్రము గావించిన ఘట్టము.

"జయకృష్ణ జయకృష్ణ కృష్ణ స్థిరాన్యందన స్థాన నానాదిన ధ్యాన నానాసితానేక సేనా రజోనీక రథ్యాతి రథ్యాళి సన్నాహసన్నద్ధ రాజన్య జన్యాగతానన్య సాదృశ్య 'దృశ్యాంగ హృష్యజ్జరాసంధ సంధాన

యం(త్రాది యత్నక్షయాదాయి.........కాంతిచ్ఛటా కాంత సంధానితాలీల లీలాలసచ్చారిణీ గీతనీరేజసంచారిణీ రాజరాజాగ్రణీ.''

ఇందు ఈవరకువలె 'నమస్తే నమస్తే నమః' యని కాక సంబోధనాంతముగనే ముగింపు కానవచ్చును. దీనినిబట్టి అట్టి నియమము లేదన్న విషయముకూడ స్పష్టముగా తేలిపోయినది. ఆలంకారికులలో కూడ, అట్లుండవలయునని యెవ్వరును చెప్పలేదు. తాము దండకమునకు వ్రాసిన లక్ష్యములందును వ్రాయలేదు. అప్పకవి మాత్రము తాను వ్రాసిన దండకలక్ష్యమునందు '...... ఘోషాంగనాలోల కాదంబినీనీల గోపాలబాలా నమస్తే పునస్తే నమః' అని యొకచోటను 'వాః కేళికా సక్త గోపీజనోత్సృష్టవస్త్రాపహారా శుకాస్యోక్త వాక్యామృతాంభోధిచంద్రోదయాసాంద్ర దేవా నమస్తే పునస్తే నమః' అని మరొక చోటను వాడెను. కావున, తెలుగునగల సంప్రదాయమునుబట్టి నమశ్శబ్దముతో ముగించుట అప్పకవి యభీష్టము. కాని అందు తన కొక సందేహము కలిగినది కాబోలును! కొంచెము మార్చుకొని ప్రయోగించెను. 'నమస్తే నమస్తే నమః' అని యన్నప్పుడు 'తే' యను చతుర్థ్యంతము రెండు మారులే ప్రయోగింపబడుచుండగా 'నమః' యనునది మూడుసారులు ప్రయుక్తమగుచున్నది. మరి మూడవసారి ప్రయుక్తమగు నమశ్శబ్దము దేనితో నన్వయింపవలయును? పూర్వమున్న సంబోధనాంతములతో నన్వయించుటకు వీలుకాదు. నమశ్శబ్దము చతుర్థ్యంతముతోనే యన్వయము నొందవలయును గావున నిచ్చట మార్పు తప్పనిసరి యని అప్పకవి కనిపించియుండును. అందువలన ఒక నమశ్శబ్దము నెగురగొట్టి తల్లోప పూరణమునకుగాను 'పునః' అను పదము నుపయోగించుకొనెను. ఇంతకును అప్పకవినిబట్టికూడ ఇది అవశ్యప్రయోక్తవ్యము అని నిర్ణయించుటకు వీలుకాదు, కావున గోపరాజు సంబోధనాంతముగనే నిడిచిపెట్టుట లోపము కాదు.

పోతనామాత్యుడు భాగవత తృతీయ స్కందమునందు దండకమును వాడెను. మహదాది తత్త్వములు యోగేశ్వరేశ్వరుడైన నారాయణుని స్తుతించినట్లుగా మైత్రేయుడు విదురునకు కృష్ణ మహత్త్వమును వినిపించు ఘట్టములోనిది—

'శ్రీనాథ నాథా జగన్నాథ నమ్మైకరక్షా విపక్ష క్షమాభృత్సహస్రాక్ష నీరేజపత్రేక్షణా దేవదేవా భవద్దాస వర్గోప తాపంబులం బాపఁగానోపు దివ్యాతపత్రంబునా బొల్చు యుష్మత్పదాంభోజమూలంబు పుణ్యాలవాలంబుగాఁ బొంది యోగీంద్రు లుద్దామ సంసార తాపంబులం బోవఁగా మీటి వర్తింతురో తండ్రి......

......జగత్కల్పనా శక్తికిన్ దేవ నీ శక్తిఁ దోడ్పాటు గావించి విజ్ఞానముం జూపి కారుణ్య సంధాయివై మమ్ము రక్షింపు లక్ష్మీమనఃపల్వలక్రోడ యోగీంద్ర చేతస్సరోహంస దేవాదిదేవా నమస్తే నమస్తే నమః''

ఇది ఆదినుండియు తగణములతో నేర్పడి గుర్వంతమై యున్నది. ఇందలి మొదటి నాలుగు సంబుద్ధులును, నృసింహ పురాణాంతర్గత దండకములో మొదట నున్నవే. ఇంకను గొన్ని విషయములందు ఎఱ్ఱాప్రెగ్గడ ప్రభావము పోతన పై నున్నట్లే దండక రచనమునందు నైత మున్నదని దీనినిబట్టి స్పష్టమగుచున్నది. దశమ స్కంధము పూర్వభాగమునందు అక్రూరుడు యమునానదీజలములయందు రామ కృష్ణుల సందర్శించిన సందర్భమున చేసిన స్తవము కూడ దండకరూపమున నున్నది—

''శ్రీమానినీమానచోరా శుభాకార వీరా జగద్ధేతుహేతుప్రకారా సమస్తంబు నస్తంగతంబై'' మున్నగు విధముగానారంభమై ''నన్ను మాయావిపన్నున్ విషణ్ణుం బ్రపన్నుం బ్రసన్నుండవై ఖిన్నతం బాపి మన్నింపవే పన్నగాధీశతల్పా కృపాకల్ప వందారుకల్పా నమస్తే నమస్తే నమస్తే నమః'' అని ముగియును. ఇందు మూడు 'నమస్తే' లపై 'నమః' యున్నది. ఈవరకు ఎఱ్ఱాప్రెగ్గడ రచనమునందే యిట్లు తటస్థపడినది. కావున నిచ్చటి యీ లక్షణము కూడ ఎఱ్ఱాప్రెగ్గడ ప్రభావమున రూపము దాల్చెనని యూహించుట యసంగతము కాదు.

ఇంక శ్రీనాథుని దండకములను పరిశీలింతము. శ్రీనాథుడు తన కావ్యములం దైదుచోట్ల దండకములను వాడెనని యిదివరకు చెప్పకొంటిమి. రచనా క్రమమునుబట్టి యైనచో శృంగార నైషధమే

మొదటిది. ఇతః పూర్వము వ్రాసిన మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి లుప్తప్రాయములు.

శ్రీహర్షుని నైషధీయ చరితమునందలి కొంత భాగమున కాంధ్రీకరణము శృంగార నైషధము. శ్రీనాథుని మనస్తత్త్వమునుబట్టి యొక్కటి చెప్ప వచ్చును. మూలరచయితతో పందెము చరచినట్లు కొన్నిచోట్ల వ్రాయుచుండును. భీమభూపతి దమయంతికి సఖిగా వర్తించుటకై సరస్వతిని రమ్మని స్తవము చేయును. మూలమున నిది చతుష్పాది వృత్తములలోనేయున్నది. కాని, శ్రీనాథుడు దానిని దండకము లోనికి మార్చెను. సంస్కృత గ్రంథమును తెనుగు లోనికి వ్రాయుచున్నప్పుడు, ఎప్పుడైనను సందర్భమును బట్టి మూల శ్లోకములనుగాని, తద్భాగములనుగాని యథాతథముగా అనువాద గ్రంథమునకు తెచ్చుకొనుట జరుగుచుండును. సంస్కృత గ్రంథమును తెలుగు లోని కనువదించుచు, అందుమరల సంస్కృత దండకమునే రచించుట శ్రీనాథునివంటివానికే తగును.

"జయ జయ జనయిత్రి కల్యాణసంధాత్రి గాంధర్వ విద్యా కళాకంఠనాళాం త్రివేదీవలీం సార సాహిత్య సౌహిత్య నిర్వర్తిత ప్రోల్లసద్వక్త్ర రంగా మనేకాభిచారక్రియాహోమధూమావళీమేచకాథర్వణామ్నాయరోమావళిం కల్పశిక్షాకల్ప సాక్ష చ్ఛరిత్రాం నిరుక్త ప్రియోక్తిం భుజద్వంద్వతా మశ్నువానేన సంశోభితాం ఛందసా జాతివృత్త ప్రభేద ప్రభిన్నేన విద్యామయీం త్వాం భజే'

ఇదంతయు నాలుగు పాదములుగా రచింపబడిన దండకమునందలి మొదటి పాదము. ఇందు మొదట రెండు నగణము లుండిన, ఆ పిమ్మట నలువది యొక్క రగణము లున్నవి. రెండవ పాదమును ప్రారంభించునప్పుడు 'భగవతి గుణదీర్ఘ భాద్భవావో' మ్మని రెండు నగణములపై అరువదియెనిమిది రగణములు ప్రయుక్తము లయ్యెను. అనగా పాదములు సమానదైర్ఘ్యము కలవి కావన్నమాట! మూడవ పాదమునందు రెండు నగణములపై ఇరువదియేడు రగణము లున్నవి. నాలుగవ పాదమునందు రెండు నగణములపై ఏబదిమూడు రగణము లున్నవి. నగణ ద్వయమును పునరావృత్తము చేయుటయే నవీన పాద ప్రారంభమునకు సూచనము.

నాల్గవ పాదము కడపట—'నమస్తే శరణ్యే నమస్తే వరేణ్యే నమశ్శర్మదాయై నమశ్శాశ్వతాయై నమో విశ్రుతాయై నమశ్శారదాయై నమస్తే నమస్తే నమః' అని యున్నది. సంస్కృతములోనే వ్రాయుచున్నను నమశ్శబ్ద మొకటి యధికముగా ప్రయుక్తమయ్యెనను శంక అప్పకవికి కలిగినట్లు శ్రీనాథునికి కలుగలేదు. కావుననే సంప్రదాయము ననుసరించి 'నమస్తే నమస్తే నమః' అనియే ముగించెను.

తరువాతి గ్రంథము భీమేశ్వర పురాణము. స్తవ స్థానములు పెక్కులున్నవి కాని యిందు శ్రీనాథుడు దండకమును వాడుక చేయలేదు. తరువాతి గ్రంథమైన కాశీఖండమందు రెండు పర్యాయములు నిబంధించెను. ఈ రెండును ఆంధ్ర భాషామయములే. మొదటిది దాక్షాయణి దక్షునికి శంభుని మహాత్మ్యమును గురించి వివరించు సందర్భములోనిది. ఇందు ప్రధాన శ్రోత దక్షుడు, వక్త్రి సతీదేవి; విషయము శివప్రాశస్త్యము. ఇది వివరణ ప్రధానము; భంగ్యంతరమున ప్రశంసానిర్వాహకమే కాని సాక్షాత్స్తవనపరాయణము కాదు. అంతే కాక, క్రమక్రమముగా నుపన్యాస వైఖరిని కూడ నావిష్కరించుట జరిగినది. అందువలననే, కడపట నమన క్రియను సూచించు శబ్దజాతము కూడ తప్పుకొన్నది.

"మతి యతఁడు సదానిదిధ్యాసితవ్యుండు మంతవ్యుండాతండు శ్రోతవ్యుం డాతండు ద్రష్టవ్యుం డాతండు......" మున్నగు విధముగా మొదటి పాదము నందు శివప్రశంసను నిర్వహించెను. రెండవ పాదమున "త్రిపురమథను ఫాలనేత్రుం త్రిలోకీగృహస్థున్" మున్నగు విధముగా ద్వితీయావిభక్త్యంతముగా శంభుని విశేషణములను పేర్కొని "నమద్బ్రహ్మ వైకుంఠ ముఖ్యామర వ్రాత కోటీర కోటీ మణిశ్రేణి శోణప్రభా జాల బాలాతపస్మేరపాదారవిందున్ భజింపం దగున్ సత్క్రియారంభ కాలంబులన్" అని కర్తవ్యోపదేశము గావించెను. మూడవ పాదమున 'జనక!' యని సంబోధించుచు శివునిపై నవష్టంభ సంరంభము మంచిది కాదని మందలించెను. నాలుగవ పాదమున "మధు మథన" యని మొదలిడి అబ్జాప్తుని, వహ్నిని,

చంద్రుని, పౌలస్త్యుని, ఇంద్రుని, బృహస్పతిని ఉపాలంభనముచేసి 'చూడంగ నేడెల్లి యెల్లుండి యీ లోన నేపాకముం బొంద నున్నారొ యే దుర్గతిం జెంద నున్నారొ యే యాపదం దూల నున్నారొ యే పంచలం దూర నున్నారొ యా మీద దైవం బౌకం డెఱ్గడున్' అని దండకమును ముగించివేసెను. చివరకు వచ్చుసరికి ఉపాలంభనమే ఉక్త విషయమగుట వలన సంబుద్ధికిగాని, నమశ్శబ్ద ప్రయుక్తికిగాని యిం దవకాశమే లేకపోయినది. ఇదివరకు చెప్పికొన్నట్లు, అట్లు చేయవలయునను నియమము కూడ లేదు గదా!

కాశీఖండమునందే సప్తమాశ్వాసమున నొక్క దండకము గలదు. అదియు వివరణాత్మకమే. శంభుడు వేర్వేరు లింగముల మహత్వములను విశాలాక్షికి చెప్పు సందర్భములోనిది —

"విను మభినవవిద్రుమాతామ్రదంతచ్ఛదా! భద్రకుండంబు గండూషితాశేషదోషంబు భద్రేశ్వర శ్రీ మహాదేవు డందుండు దత్కుండ పూర్వోత్తరాశా విభాగంబునన్ జక్రకుండంబు చక్రేశు డందుండు దత్సేవ సంసార చక్రక్రమప్రక్రియాధిక్కృతి ప్రౌఢ...... లక్షకోట్యర్బుదన్యర్బుదానేకలింగంబు లాకాశ గంగా ప్రతీరంబునన్ గాశికాక్షేత్ర సీమా విభాగంబునన్ భోగమోక్షంబులున్ సేవకశ్రేణి కీ జాలు గల్యాణి! కాత్యాయనీ! దేవి! నారాయణీ! శ్రీ విశాలాక్షి! సత్యంబు సత్యంబు సత్యంబు ముమ్మాటికిన్."

ఈ దండకమునందు నింతకుముందువలెనే రెండు నగణములపై రగణములను చివరంట నుపయోగించెను. మొత్తము దండకమంతయు ఒకే పాదముగా నడచెను; పూర్వదండకమునందువలె నాలుగు పాదములుగా నడిపించు రీతిని శ్రీనాథు డిందు పాటింపలేదు.

ఈ రెండింటియందును చివర నమశ్శబ్ద ప్రయోగము లేకుండుటయేకాక, ఆదియందు జయ శబ్దముకూడ ప్రయుక్తము కాలేదు. పైగా స్తోత్రమునకు వినియోగము కావలసిన దండకము వివరణమునను, వర్ణనమునకు వాడుకొనబడినది.

హరవిలాసమునందు దారుకావన విహార సందర్భమునను, సముద్రమథన సందర్భమునను రెండు సారులు దండకము వాడబడినది. ఏకపాద దండకమునే జయశబ్దముతో నారంభించి నమశ్శబ్దముతో ముగించుట రెండుచోట్లను కనుపట్టును.

దారుకావన విహార సందర్భమున 'జయజయ శివలింగ జ్యోతిర్మహాలింగ లింగోద్భవశ్రీమహాలింగ వేదత్రయీలింగ' మున్నగు విధముగా సాగి 'ఐంలింగ ఈంలింగ ఓంలింగ దివ్యాత్మ నానావిరూపాక్షలింగా నమస్తే నమస్తే నమః' అని ముగిసినది.

సముద్ర మథన సందర్భమున దేవతలును రాక్షసులును విఘ్నేశ్వరుని స్తోత్రము చేయుదురు. ఆ స్తోత్రము దండక రూపమున నున్నది—

'జయజయ జగదేకరక్షామణీ దేవచూడామణీ శ్రేణికా శోణప్రభాజాల సుస్మేర పాదారవిందా! ముకుందప్రియా! యిందుధారీ! కటస్యందిదానాంబు ధారాధునీ ధోరణీ గాహ కౌతూహలాయత్త మత్తద్విరేఫాంగనా గానసంగీత రంగీకృత స్వాంత......ఏ విఘ్నముం బొందకుండంగ నే క్రియం జెంద కిష్టార్థ సంసిద్ధులం గైకొనుం గాక నీయాజ్ఞ సర్వేశ! సర్వాత్మకా! నిర్వికల్పా! నిరీహా! నిరాతంక! నిశ్శంక! యోంకార మూర్తీ! నమస్తే నమస్తే నమః.'

ఇంతవరకు చూచినవారిలో కొలని గోపరాజును, శ్రీనాథుడునుకాక తక్కినవారు తగణములతోనే దండక రచన గావించిరి. గోపరాజు సగణ నగణములను వాడి, పైని రగణములను చివరంట వాడుకొనెను. శ్రీనాథుడు తాను వ్రాసిన యైదు దండకములందును రెండు నగణములతో మొదలుపెట్టి రగణములతో నిర్వహించుట లక్షణము గావించుకొనెను. సంస్కృత లాక్షణికులు 'దండకో నాద్రః' అని చెప్పిరి. ఆ లక్షణమున కనుగుణముగా నద్వయముపై రగణములను ప్రయోగించిన కవి శ్రీనాథు డొక్కడే. ఈ లక్షణమును తెలుగు లాక్షణికులును చెప్పిరి. కాని, నన్నయాదుల మార్గము కాని, గోపరాజు మార్గము కాని సంస్కృత లాక్షణికులకు సమ్మతమైనట్లు కనబడదు. అయినను తెలుగున బహుళ వ్యాప్తి నొందిన దండకము తగణ

ఘటితమైనదే. శ్రీనాథుని దండక రచనమే తెలుగు లోకమున విలక్షణముగా ననిపించును. దానికి తోడు పాదవిభాగ మొకటి. ఇతరుల గ్రంథములలో ఆది నుండి యంతమువరకు నేకధారగానున్న రచనము శ్రీనాథుని గ్రంథములలో కొన్ని యెడల నాలుగు పాదములుగా విడివడినది. లాక్షణికులు ఏక పాదముగా గాని, చతుష్పాదముగాగాని యుండవచ్చునని సంస్కృతము నందును, తెలుగునను గూడ నిర్దేశించిరి. అయినను శ్రీనాథునివరకున్న ఆంధ్ర సాహిత్యలోకమున చతుష్పాద విభాగము గల దండకములు శ్రుతి గోచరములు కావు. శ్రీనాథుడే అట్టి నియమమునకు లక్ష్యలోకమున నాంధ్రులలో నాద్యుడనిపించును. ఆతడు కూడ పాద విభాగము ననుసరించెనే కాని ప్రతి పాద గణ సంఖ్యా నియతి ననుసరింపలేదు. ఒక పాదమున నెక్కువ గాను ఒక పాదమున తక్కువగాను, గణములను వాడు కొనెను. అనియత గణ వృత్తమైన దండకమునందు అట్టి నియమ మపేక్షణీయము కూడ కాదు.

ఇంక దండకములందును, ఆశ్వాసాంత పద్యము లందును శబ్దము లెన్ని సొగసులైనపోవును. సర్వ విధములగా శబ్దాలంకారములకు ఈ రెండు స్థలములును స్థావరములు. శబ్దముల పునరావృత్తి మంత్ర మోహనమై, ఆవేశ సముజ్జ్వలమై, పాఠకుని చిత్తమునకు రెక్కలిచ్చి, ఎత్తులకు తీసికొనిపోయి, బహిరుపాధి విస్మృతిని గలిగించి, అంతశ్చైతన్యమును గలిగించు ననుటలో నాశ్చర్యము లేదు. కావుననే కావ్యాంతర్గతములైనవి కాని, స్వతంత్రములై ముక్తక ప్రతిపత్తిని సాధించికొన్నవి గాని, పాఠకలోకమునకు సద్యః పారవశ్య సంధాయకములై సంతృప్తిని సంపాదించిపెట్టుచున్నవి, చర్విత చర్వణములైనను పునశ్చర్వణ యోగ్యములై యొక తృప్తిని, దీప్తిని కలిగించుచున్నవి. అస్తు.

—స్ఫూర్తిశ్రీ.

## అంతరాక్కర యతి విశిష్టత

లోగడ భారతి (మే, 1965 సంచిక)లో నేను ఉల్లేఖించిన కుమారసంభవమందలి చిత్రకవితాంతరాక్కరయతిని విమర్శించుచు, శ్రీ బండి నాగరాజా గారు మరల భారతి (జూలై, 1965 సంచిక)లో 'యతిపోయినది' అని నిరూపించుట తొందరపాటు కాకపోదు.

'అసలు ఎట్లయినను నాల్గవ పాదమున యతి పోయినది.' అనుట సద్విమర్శ కాదు.

నన్నిచోడ కవిరాజ శిఖామణి కుమారసంభవము లోని క్రింది చిత్రకవిత, త్రివిధాక్కరలతో ఉన్నది. ఇప్పుడిది చాలు.

మురిసెడు రూపులున్
    మురిసి మ్రొగ్గెడి రూపులు
మ్రొగ్గి జిట్టునం దిరిగెడి రూపులుం
    దిరిగి త్రెళ్ళెడి రూపులు
ద్రెళ్ళి నేలపైఁ బొరలెడి రూపులుం
    బొరలిపోయెడి రూపులుఁ
బోయి క్రమ్మఱన్ మరలెడి రూపులున్
    మరలి మ్రగ్గెడి రూపులు నయ్యె న య్యనిన్.

—(కు. సం. 11—131)

ఇది యుద్ధఘట్టములోని చంపకమాల. దీని క్రింద ఒక ఉత్పలమాల, మరియొక చంపకమాల ఉన్నవి. కాని, అవి రెండు చిత్రకవితకు లొంగవు. (ఉ. వెక్కెడి రూపులున్......(132). చ. విఱిగెడి రూపులున్......(133). ఇవి సాధారణ వృత్తములు). పోతే, 'చ. మురిసెడి రూపులున్... (131) అను మొదటి పద్యము చిత్రకవితకు తావిచ్చుచున్నది. 1948-భారతి 11 సంచికలోను, నన్నిచోడ కవి చరిత్ర (1951) లోను అందలి త్రివిధాక్కరలను వివరించియుంటిని.

శ్రీ బండి నాగరాజాగారి చిత్రకవితాక్కరల చర్చను తెలిసికొనియున్నచో, 'అట్టి స్ఫురణము శ్రీ రెడ్డిగారు పేర్కొన్నచోట నాకు స్ఫురించలేదు' అని వాచ్యముగా చెప్పియుండెడివారు కాదు. చంపక మాలకు ముందున్న కందములో చోడకవి వ్యంగ్య సూచన 'అనుబంధములునగు' (కు. సం. 11–130) అని వ్యంజకము చేయుచున్నది. 'అ—నుబంధములున్ నుబంధములును' అగుట వ్యంగ్యచిత్రము. సభంగ శ్లేష — సూచన. ఉన్న వ్యంగ్య కవి సూచన గుర్తింపకపోవుట దురదృష్టము.

'ఇన్ని తిరువీథు లూరేగించి, దీనిని 'నన్ని

చోడుని గర్భితాంతరాక్కర' అనుకున్న నేమాయె?' అన్నచో, అంతరాక్కర యతి స్థానములు మార్పు గోచరించుటను అని సమాధానము చెప్ప వీలున్నది కాబట్టి.

ఇక యతి తప్పినదేమో? పరిశీలింపుడు

'..............క్రమ్మ అన్ +

(న్మ—న్+మ—)—మరలి క్రమ్గ్గడి రూపులు—
నయ్యో నయ్యనిన్.

'ఇందు మూడవ పాదము చివరగల ద్రుతమును సంశ్లేషము—న్మ—గావించినను — సంయుక్తపద్ధతికూడ—అఖండ యతిశరణ్యమగును! ఇది నన్నెచోడునకు సమ్మతమేనా?' అవును. సమ్మతమే! ఒక్క నన్నెచోడునకే కాదు; నన్నియభట్టునకుకూడ సమ్మతమే. ఉదాహరణములు: చూడుడు.

సీ. అహికుండలంబుతో—యుజకర్ణ పూరంబు
గడ్డంబు జిగిఁదొలు—కాడువెక్కు.
—(కు. సం. 12—209, రెండవ పాదము)

ఇది అర్ధనారీశ్వరు వర్ణనలోనిది.

ఇట్టిదే వ్రాతప్రతిలోని మరియొక సీసపాదము నన్నయ్యది.

సీ. నీలజీమూతము—లీల నాక్షేపించి
నల్లనై తోఁతెంచు—నట్టి తనువు.
—(భార. ఆది. 6—214, మొదటి పాదము.)

ఇది హిడింబాసురువర్ణనలోనిది. పై రెండు సీసములలోని చిన్నపాదముల యతులు—నన్నికవిద్వయ ప్రయోగములు అఖండయతులు కావనుట విపరీత వాదము. ఇట్టిదే, ఇప్పుడు వివాదములో ఉన్న అఖండ యతిగల అంతరాక్కర యతి విశిష్టత. చూడుడు.

—క్రమ్మ అ
న్మరలి క్రమ్గ్గడి రూపులు —
నయ్యో నయ్యనిన్.

దీనిలో అనంతుని ఛందస్సు చెప్పినట్లు 'ఏకోనాక్షర త్రిగణ మంతరకున్' యతి మైత్రి చెల్లినది.

ఒక అక్షరము తక్కువగా మూడవ గణాంతములో యతి చెల్లుట అంతరాక్కర లక్షణము. కాదంటే, మూడవ గణాంతమందు యతి చెల్లుట సహజము. కాని, అనంతుని లక్ష్యము తల్లక్షణ విరుద్ధము. ఇతర లాక్షణికులు చెప్పినట్లు—నాల్గవ గణము మొదటి అక్షరము యతి స్థానమని మార్చి చూపుట ప్రాచీన అంతరాక్కర లక్ష్యలక్షణ సమ్మతము కాదు.

అనంతామాత్యుడు ప్రాచీన లక్షణము చెప్పియు మరల నవీన లక్షణ సమన్వయము చేసినాడేమో! అని అనిపించకపోదు.

ఈ ఊహ కాధారముకూడ గర్భచిత్ర కవితాంతరాక్కరలోనే—విలక్షణ లక్ష్యముగా—కలదు.

న్మరలి క్రమ్గ్గడి రూపులు—
నయ్యో, నయ్యనిన్.

దీనిలో చంద్రగణము నాల్గవదికాక, రెండవదిగా మారినందువల్ల 'ఏకోనాక్షర త్రిగణాంత యతి' భంగములేక, అంతరాక్కర లక్షణము సమన్వయ మగుచున్నది. ఇది ప్రాచీన లక్షణము. కాదంటే—రూపాంతర దృష్టి భేదము.

న్మరలి, క్రమ్గ్గడి, రూపులు,
నయ్యో నయ్యః (నిన్).[1]

---

1. అత్యంత ప్రాచీన లిపితో ఉన్న రేనాటి చోడ దాన శాసనగద్యములో క్రింది మధురగతి రగడ చిత్రితమై యున్నది.

అణపోతులు రే—వణ కాపుద్నణ
ఇచ్చిన పన్నస—ఇకెరేవికిన్.

ఇది గద్య కాదు; ద్విరదగతి రగడలో గర్భితమైన మధురగతి రగడ యనుట నిక్కము. కాని, చరిత్రకారులు కొందరు సందేహించుట సర్వసాధారణమైనది.

మొదటి పాదములో అ—వ (వ్ + అ—వ) లకు అఖండయతి చెల్లినది. అది నామాఖండ యతి యని మారు పేరుతో చెల్లుచున్నది. ఇట్టిదే కదా! న్ + మ(న్మ)—న్ + అ— (న) అంతరాక్కర అఖండ యతి.

రగడలో కడపటి గణము '(ని)న్' చేరనిదే; అంతరాక్కలో కడపటి గణము '—(నిన్)' లోపించనిదే గణములు కుదరవు.

దీనిలో కావ్యాలంకార చూడామణి చెప్పినట్లే 'అంతరాక్కర మబ్ధి సంఖ్య'మీద యతి చెల్లినది. ఇది నవీనలక్షణము. కాగా, పాదాంతములో ఉన్న పెచ్చు గురువు (విన్) లోపించునట్లు లక్షణము మార్చ బడినది కాబోలు.

తేటగీతికిని అంతరాక్కరకును మధ్య భేదము చూపుటకే చంద్రగణస్థానభేదము, లేదా పాదాంత గణాధిక భేదము కారణ మగుచున్నది.

భారతమందలి నన్నయ—అక్కరల గణము లన్నియు ఛందోలక్ష్యలక్షణములకు లొంగుటలేదు కదా[2]. యతిస్థాన భేదము నిర్వివాంశమేకదా! కాగా; చిత్ర కవితాంతరాక్కరలో వైకల్పిక యతిస్థానములు భిన్న ఛందస్సులనుట కవకాశము లేదు.[3]

చంద్రగణములలో 'రల (ΟΙΟΙ);రగ (ΟΙΟΟ)' గణము లున్నట్లు మాత్రమే జానుతెనుగు ఛందస్సులు చెప్పుచున్నవి. కాని, కవిరాజ శిఖామణి చోడుని గర్భ చిత్ర కవితాంతరాక్కర లక్ష్యలక్షణములో 'రలగ (రవ—ΟΙΟΙΟΙ)' కూడ చంద్రగణముగా దృష్టాంత మిచ్చుచున్నది. ఇది వైకల్పిక లక్షణము కాబోలు.

గణాంతరము (మధ్య) లో యతి చెప్పుటయో, చంద్రగణాదిలో యతి చెల్లుటయో వైకల్పిక మనుట అనంతుని ఛందోలక్షణము. దీని కుదాహరణము ఛందోదర్పణములో వాచ్యముగా లేకపోయినను, 'ఏకో నాక్షర త్రిగణ మంతరకున్' యతి యనుటవల్ల వైకల్పిక సూచన లేకపో లేదన వీలున్నది. దీని కుదా హరణముపైన వివరించిన 'సుబంధములు నగు'నన్న నన్నిచోడకవి చంపకచిత్రబంధములో గూఢ వస్తు మయ కావ్యముగా కనబడుచున్నది.

గణాంతరము (మధ్య)లో చిత్రకవితాంతరాక్కర యతి చెల్లుటచేత నది అంతరాక్కరయతి విశిష్ట తను, తన్నామసార్థకతను (సూచనను) వ్యంజకము చేయుచున్నది. శ్రీ బండి నాగరాజుగారీ 'సుబంధములు నగు(న్)' అను చోడకవి వ్యంగ్యసూచనను గుర్తించక పోవుటయేగాక

'అట్టి స్ఫురణము శ్రీ రెడ్డిగారు పేర్కొన్న చోట (కు. సం. 11 ఆ. 130, 131 పద్యము లలో) నాకు స్ఫురించలేదు.' అనుట ప్రత్యక్ష ప్రమాణ విరుద్ధమేకదా!

'గణ విభజన చేసినచో నాల్గవ గణారంభమున యతి.....కాని ఇట్లు చివర గురువు నిల్పుట అశాస్త్రీయము.....ఇదియు విచార్యమే! ముందు నూయి, వెనుక గోయిగా నున్నది. అసలు ఎట్లయినను నాల్గవ పాదమున యతి పోయినది.....అఖండ యతి శరణ్యమగును! ఇది నన్నిచోడునకు సమ్మతమేనా?' అని శ్రీ బండి నాగరాజుగారు ప్రశ్నించుట తొందర పాటు అగునో కాదో నిర్ణయింపుడు. ఉదా. చూడుడు.

గడ్డంబు జిగిదొలు—కాడుచెక్కు

—(కు. సం. 12-209. సీ. — చిన్న పాదము.)

ఇది వాచ్యముగా నన్నిచోడకవి చిన్న సీసపాద ములో ప్రయోగించిన అఖండయతి. ఉదా. 'గ—కా (కు+ఆ—కా)' దీనికి పాఠాంతరముల సృష్టి దోషముకూడ లేదు. ఇట్టిదే వాచ్యవ్యంగ్యముగా చోడ కవిరాజ శిఖామణి సూచించిన అంతరాక్కర పాదము.

---

2. ఉదా. చూడుడు. (మధ్యాక్కర)

తోనే, గె నుత్తరము మించి ధర్మని—త్యుం
డు ధర్మజుండు. వైకల్పికము
తోనే, గె ను(త)రము మించిధర్మని—త్యుం
డు ధర్మజుండు — (ఆది 4-3)

వీటిలో సూర్యగణము 2—3 చోట్లకు మారి నట్లు (ఉత్తరము — ఉతరము?) కనబడుచున్నది. అంతరాక్కరలో చంద్రగణము 2—4 చోట్లకు మారినట్లు త్రిగణాంతర యతి సూచన.

3. '.....ఇటువంటి (మధ్యాక్కర) పాదము లకు (సూర్యగణము 3 వ చోటనేగాక మరియొక స్థలమునందైనను నుండవచ్చునని నన్నయ యభిప్రాయ మేమో —అని) లక్షణము నిరూపించవచ్చునుగాని ఇత మిద్దమని చెప్పలేము' అని డాక్టరు శ్రీ గిడుగు సీతాపతిగారు.

(ఛం. ద. పీఠిక, 59 పుట.)

ఈ సూచన చిత్రకవితాంతరాక్కరలోని చంద్ర గణస్థానభేదములతో పోల్చి చూడుడు.

ఉదా: 'రెండవచోట నాల్గింట — గణంబు (మార్పు,)

అది 'సుబంధములునగు'నను వ్యంగ్యసూచనతో ప్రయోగించిన, అఖండయతి, ఉదా. 'న్మ (న్ + మ—న్మ)—న (న్ + అ—న.')

దీనికి కూడ పాఠాంతరదోషము లేదు.

మరియొక చంపకములో రగడలు (కు. సం. 12–181) చిత్రకవితోదాహరణములుగా పేర్చుట చేత, అవికూడ 'సుబంధములు నగు'నో, కావో నన్నిచోడకవి చరిత్రలో చూచి నిర్ణయింపుడు.

ప్రబంధ పద్య పీఠికలో చోడకవిరాజు (నేను) 'అన్యతారకవి— తతుల నాదరిం(చి)-తు'అనుట కీ అన్యోన్యతారక చంపకద్వయము తార్కాణమగుచున్నది. కాగా, ఆ చిత్రకవి(తా)తతులు— అక్కరలు, రగడలు—'సుబంధములు నగు'నో, కావో కూడ పరిశీలింపుడు.

అక్కరలు లేని జానుతెనుగు కుమారసంభవములో గర్భితాంతరాక్కరలును కలవనుట దుర్విమర్శ? భావించి, అన్యాపదేశముగా సాహిత్యసమీక్ష చేసిన ఒక సుప్రసిద్ధ పండితుని పరామర్శ యెట్టిదో కూడ పరిశీలింపుడు.

ఇట్టి అవకాశమును కల్పించిన శ్రీ బం. నాగరాజుగారికి నమోవాకములు

—దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

---



# లేఖలు

## ప్రాచీనసాహిత్యము-విమర్శ

ఆర్యా,

మీారు ఈ ఏప్రిల్, మేనెలల భారతీ సంచికలలో ప్రచురించిన శ్రీ నాగళ్ల గురుప్రసాదరావుగారి "ప్రాచీనసాహిత్యము – విమర్శ" అను మంచివ్యాసమును, ఏప్రిల్ సంచికలో దానిని గూర్చిన శ్రీ రాధాకృష్ణమూర్తిగారి చక్కని లేఖను చదివి ఈ లేఖద్వారా నా అభినందనలు తెల్పుచున్నాను.

ఇంత సమగ్రమైన సర్వాంగసుందరమైన విమర్శ యిదివఱకు వెలువడలేదనియే నమ్ముచున్నాను. శ్రీ ప్రసాదరావుగారు మంచి విమర్శక లక్షణములు బాగుగా గలవారు కావుననే

'పురాణ మిత్యేవ న సాధు సర్వం
నచాపి కావ్యం నవ మిత్యవద్యం' అను పద్ధతిలో

తమ వ్యాసమును సాగించియున్నారు. అట్టి సమదృష్టియీ వ్యాసములు వ్రాయువారికి తప్పక యుండవలయును. అది వీరియందు సముచితముగ నున్నది. కావుననే 'ప్రాచీనులు తమకంటె పూర్వులయిన కవుల కావ్యములను, సమకాలికులగు కవుల కావ్యములను ఏరీతిగా విమర్శించిరో మనకు తెలియదు. అట్లని వారికి విమర్శ తెలియదనుకొనుట పొరపాటు...సాహిత్య శాస్త్రమునకు మెఱుగులుదిద్దిన వారెందఱో కలరు. విశ్వనాథుడు జగన్నాథపండితుఁడు కావించిన కృషి సామాన్యముకాదు' అని వ్రాసి ప్రాచీన విమర్శకుల యెడఁ దమకుగల గౌరవమును బ్రకటించిరి. 'ఆనందవర్ధనాదులు చెప్పినమాటలకు సంవాద ప్రాయములయిన మాటలు 'కవిత్వ తత్త్వ విచారము' నందున్నవి.' 'కావ్యము చేయుచున్నచో నెంతజాగరూకత వహింపవలెనో ఆనందవర్ధనుఁడు చెప్పెను' అనుచు ఆనందవర్ధనుని యందు తమకుగల గౌరవభావమును వ్యక్తపఱచిరి. 'ఇట్టి కావ్యకళాసిద్ధాంతములతో ప్రాచీన సాహిత్యవిమర్శలు వచ్చినవి. ప్రాచీన కావ్యములయందలి కథా సన్నివేశముల సౌందర్యమును దర్శించుట, పాత్రల చిత్త వికాసమును పరామర్శించుట విమర్శగా చలామణి అయినది. ఈనాటికి గూడ అట్టి విమర్శయే వచ్చుచున్నది. ఇక ముందును రాగలదు" అని ప్రాచీన విమర్శ యందు గౌరవమును వెలిబుచ్చిరి.

కొందరు 'ప్రాచీన విద్వాంసులకు గాని ప్రాచ్య భాషా పట్టభద్రులగువారికిగాని విమర్శ యనునది అసలే తెలియదు. ఒకవేళ తెలిసినను వారు చేసినది విమర్శయే కాదు' అనగా, నేను 'జగన్నాథ పండితరాజు, ఆనందవర్ధనుఁడు, అప్పయ్యదీక్షితులు మొదలగువారు, రసనిధానములైన కాళిదాసాది కావ్యములయందు జేసిన విమర్శ ఏమాత్రము విమర్శయే కాజాలదా? అప్పయ్య దీక్షితులవారు 'స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః' అను కాళిదాస కవితను తన చిత్ర (కావ్య) మీమాంస యందు చక్కగా విమర్శించి ఆ కావ్యమునందు వ్యంగ్యముగా నున్న పార్వతియొక్క అనితర దుర్లభమును అసాధారణమును నగు సౌందర్యమును,

'నాసాగ్రన్యస్తనయనః సంవృతాస్య స్సునిశ్చలః।
ధ్యాయాత మనసాదేవ మురో విష్టభ్య చాత్మనః॥'

అను లక్షణములు గల పార్వతి ధ్యానస్థితిని దెలిపి దానిని ఉత్తమధ్వని కావ్యమునుగా నిరూపించియున్న విమర్శ విమర్శయే కాజాలదా?' అంటిని. అప్పుడువారు దానిని విమర్శలో నేకదేశముగా గూడ నంగీకరింపక పోవుటేకాక ప్రాచ్య విద్వాంసులు పట్టభద్రులు మల్లినాథసూరి వ్యాఖ్య లేనిదే సంస్కృత పద్యమును సైతము సమన్వయించుకోలేరనియు ఈసడించుటకూడ జరిగియున్నది. శాంతం పాపం.

భారతిలో శ్రీ గురుప్రసాదరావుగారి వ్యాసము, అట్టివారి భావములను కొంతవఱకైన మఱలింప గలదేమో !

నిష్పక్షపాతముగా ఇరుపార్శ్వముల గుణదోషములను దెలుపు ఈ వ్యాసమునకు భారతిలో సముచిత స్థానమిచ్చిన మీా చిత్తోదాత్తతను ప్రశంసించుచున్నాను.

—అవ్వారి వాసుదేవశాస్త్రి.

## నన్నయ—"ఉండకున్నది"

ఆర్యా,

'ఉండకుండునది' అనే రూపానికి 'ఉండ కున్నది' అనే రూపాంతరం తెలుగు వ్యాకరణ సాధ్యమా? అలాంటి రూపాంతరం ఒకటి నన్నయ రచనలో కనిపిస్తూంది.

యయాతి ఇంద్రలోకానికి వెళ్ళినప్పుడు ఇంద్రుడాతనిని పూజించి, 'కొడుకు జవ్వనంబుగొని నీవు నిజరాజ్య భూరి భరము వానిఁ బూన్చునప్పు డతని కెద్ది గఱపి'తని అడుగుతాడు. యయాతి తాను పూరునకు బోధించిన నీతులు చెబుతాడు. ఆ నీతులలో ప్రతి వాక్యం 'ఎఱిఁగిన దానిని మఱవ కనుష్ఠించునది', 'ఇచ్చునది ధనము పాత్రునకు', 'ఒరువేడకుండునది' 'చేయునది సర్వభూత ప్రీతిన్', '...అగు పలుకొనరగఁ బలుకునది' అని ఈ విధంగా విధిరూపంతోనే అంతమవుతుంది. ఇట్లా నడిచిన మూడు కంద పద్యాల తరువాత ఈ క్రింది సీసం ఉంది:

'వదన బాణాసన వ్యక్తముక్తములైన
పలుకులన్ గడు వాఁడి బాణతతులఁ
బర మర్మ లక్ష్యముల్ పాయక భేదించు
చుండెడు దుర్జన యోధవరుల
కడ నుండకున్నది కరుణ యార్జవ మక్ష
జయము సత్యంబును శమము శౌచ
మనునవి యెద నిల్పునది శత్రు షడ్వర్గ
జయమందునది శుద్ధ శాంత బుద్ధి'

తే. మదము గామంబు క్రోధంబు మత్సరంబు
లోభమును మోహమును నను లోని సహజ
వైరి వర్గంబు నోడిచిన వాఁడ యోడుచు
న(శమంబున వెలుపలి యహిత తతుల.
(భార. ఆది—3—206; వావిళ్ల—1946 ప్రతి)

నన్నయ పద ప్రయోగ కోశ సంపాదకులు 'ఉండకున్నది' అనే రూపానికి 'లేకున్నది' అనేఅర్థాన్ని సంభావించి అవ్యవహితోత్తరంగా ఉన్న 'కరుణ'ను దానికి కర్తగా సరఫరా చేసినట్లు కనిపిస్తూంది. ఆ కోశంలో—

'ఉండకున్నది : దుర్జన యోధవరుల కడ నుండకున్నది కరుణ...........' 1 3 206 (పుట 219) అని ఇచ్చారు. కాని అలా అర్థం చెబితే పై మూడు కందాలలోనూ, ఈ సీసంలోనూ విధినిర్దేశక క్రియలతో ముగిసే ఇతర వాక్యాలతో ఈ వాక్యాని కెలా సమన్వయం సాధించడం?

నన్నయ పదప్రయోగ కోశం మరికొన్ని విశేషాలుకూడా చెబుతున్నది. నన్నయలో 'ఉండకున్నది'కి ఇది ఒక్కటే ప్రయోగం. 'ఉండకున్న' అనే రూపానికీ ప్రయోగాలు లేవు. కాని 'ఉండకుండు' ధాతువునకు 'ఉండకుండునట్లు'గా (1), 'ఉండకుండ' (3) అనే రూపాల వాడకం మాత్రం కనిపిస్తూంది. ఇక— 'లేకుండ' (పుణ్యలోకంబులు లేకుండ నేనేమి దుష్కృతంబు చేసితి) కు 2 ప్రయోగాలున్నవి. పై ప్రయోగాల పరిశీలనంవల్ల అత్యంతాభావార్థంలో 'లేకుండు' ధాతువు, వసత్వభావార్థంలో 'ఉండకుండు' ధాతువు నన్నయకు అభిమతమని తోస్తుంది. ఆ దృష్ట్యా చూస్తే దుర్జన యోధవరులలో కరుణాభావాన్ని చెప్పటం నన్నయ అభిప్రాయమైతే వారి 'కడ లేక యున్నది కరుణ' అని అనేవాడేమో!

సంస్కృత మూలంకూడా 'కరుణ' కర్తృ కాన్వయాన్ని సమర్థించడంలేదు. ఈ నీత్యుపదేశక ఘట్టానికి సంస్కృతమూలం ఇది:

'అరుంతుదం పరుషం తీక్ష్ణవాచం
వాక్కంటకైర్వితుదంతం మనుష్యాన్ ।
విద్యా దలక్ష్మీకతమం జనానాం
ముఖే నిబద్ధాం నిరృతిం వహంతం ॥

సద్భిః పురస్తా దభిపూజితః స్యాత్
సద్భి స్తథా పృష్ఠతో రక్షితః స్యాత్ ।
సదా సతా మతివాదాం స్తితిక్షేత్
సతాం వృత్తం చాదదీతార్యవృత్తః ॥

వాక్సాయకా వదనా న్నిష్పతంతి
యై రాహతః శోచతి రాత్ర్యహాని ।
పరస్య వా మర్మసు తే పతన్తి
తాన్ పండితో నావసృజేత్ పరేషు ॥

నహీదృశం సవసనం
త్రిషు లోకేషు విద్యతే ।
దయామైత్రీచ భూతేషు
దానంచ మధురాచ వాక్ ॥

తస్మాత్ సాంత్వం సదావాచ్యం
నవాచ్యం పరుషం క్వచిత్
పూజ్యాన్ సంపూజయే
ద్దద్యా న్నచ యాచేత్ కదాచన ॥

(ఆది. ప. 87—శ్లో 9—13.)

అన్యముద్రిత అముద్రిత ప్రతుల్లో సాధుతర పాఠాంతరం ఉంటేగాని, విధ్యర్థంలో ఈ రూపానికి వ్యాకరణగతిని కల్పించగల అవకాశం ఉంటేగాని తద్జ్ఞులైన విద్వత్ పరిశోధక వరేణ్యులు తమ పత్రికా ముఖాన ప్రకటింతురుగాక అని నా ప్రార్థన.

—బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు.



# గ్రంథ విమర్శలు

## సుశీల

[నవల, రచన: నిడమర్తి సత్యనారాయణ మూర్తి, ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ—2. వెల: రూ. 6/—పుటలు: 371]

ఈ నవల 1927 లో వ్రాయబడి అముద్రితంగానే ఉండిపోయి, ఈ ఏడాది ఫిబ్రవరిలో మొదటిసారిగా వెలుగు చూచింది. కథావస్తువులో, నిర్మాణములో, చిలకమర్తివారి సాంఘిక నవలల వరవడి ఈ నవలలో కనిపిస్తుంది. యాభై ఏళ్లనాటి రాజమహేంద్రవరం, వీరేశలింగంపంతులుగారి సంస్కరణోద్యమం, దాని తాలూకు ప్రభావం అభివర్ణించే యీ నవల మనకు ఒకవిధంగా ఆసక్తి కలిగిస్తుంది—సంఘ పరిణామం దృష్ట్యా నాటి స్థితిగతుల్నీ నేటి స్థితిగతుల్నీ పోల్చిచూచుకోవచ్చు. ప్రకాశకులుకూడా ఈ లక్ష్యాన్నే సూచించారు.

వితంతువులకు చదువు చెప్పించడం, పునర్వివాహాలు జరిపించడం: వీరేశలింగంపంతులుగారి సంస్కరణం ఒక ఎత్తు, తత్ఫలితంగా ఏర్పడిన వ్యక్తిగతమైన, ఆర్థికమైన, నైతికమైన సమస్యలు మరొక ఎత్తు. ఒక సంస్కరణం తలపెట్టడంతో స్పష్టంగా కనిపించే, ఒక దురన్యాయాన్ని రూపుమాపడమే అవుతుంది కాని తద్ద్వారా ఉత్పన్నమయ్యే క్లిష్టసమస్యలు ఎన్నో మళ్లీ ఉంటాయి! ఈ సమస్యల్లో కొన్ని పంతులుగారి వృద్ధాప్యంలో ఆయనదృష్టికి రావడం, ఆయన సహజధోరణిలో, నిస్స్వార్థంతో ఆ యా వ్యక్తులకు పరిష్కారమార్గం చూపిస్తూ వారి శ్రేయస్సుకోసం శ్రమిస్తూ అందరికీ మాన్యులుగా ఉండటం ఈ నవలలో కనిపిస్తుంది. ఇక్కడ కథావస్తువు ప్రధానంగా పంతులుగారి సంస్కరణోద్యమంకాదు; సంస్కరణ ఫలితంగా ఉత్పన్నమౌతున్న నూతన సమస్యలు. ఈ సమస్యలన్నింటికీ పంతులుగారే పరిష్కారమార్గం చూపించి ఉండవలెననుకోవడం, లేక వారి సంస్కరణనే మనం తప్పుపట్టడం, కేవలం అవివేకం. ఈ పరిస్థితిని—అనగా వీరేశలింగంగారి ఉద్యమ సాఫల్యదశను, వాస్తవికంగా, దాని తాలూకు పరిణామాన్ని గుర్తిస్తూ, అభివర్ణించడమే ఈ నవల సుగుణం.

కథలో ఆనాడు సంస్కరణ వివాహం చేసుకున్న రెండు జంటలు; రత్తమ్మ, వెంకట్రావు; కనకమ్మ, నారాయణరావు. రత్తమ్మ చిన్నతనంనుంచీ లేమిలో పెరిగి, పంతులుగారి సమాజంలో పనిచేస్తూ లౌక్యం నేర్చుకుని సర్వతంత్ర స్వతంత్రురాలైన వ్యక్తి; వెంకట్రావు అనే చిన్న ఉద్యోగిని సంస్కరణ వివాహం చేసుకున్నా, సంఘంలో ప్రముఖ వ్యక్తిగా తిరగాలని రత్తమ్మ ఉబలాటం. రత్తమ్మ తన కొమార్తె రామాబాయిని ప్రోత్సహించి, కాలేజిలో చదువుతున్న రామయ్య అను యువకుణ్ణి ఆకర్షించి రామాబాయితో అతనికి చనువు కల్పించి, అతణ్ణి నైతికంగా బాధ్యుణ్ణిచేసి, రామాబాయిని అతనికి కట్టబెడుతుంది. రామాబాయి తల్లి పెంపకము ఫలితంగా స్వతంత్ర ప్రవృత్తి కల వ్యక్తి. చదువుమీదకంటె సరదాలమీద ఆసక్తి హెచ్చు. పెళ్లితర్వాత రామయ్య ఉపాధ్యాయవృత్తిచేసి సంపాదించి చదివిస్తూవుంటే రామాబాయి హాయిగా కాలేజికి వెళ్లివస్తూ బి. ఏ. పరీక్ష ఫెయిల్ అవుతుంది. ఆమెకు అంతటితో సరదా తీరినట్టులేదు. ఒకనాడు భర్త స్నేహితుడైన పాపారావుమీద 'ఆసక్తి' చూపిస్తుంది. పాపారావు ఆమెకు బుద్ధులుచెప్పి మనస్సు మారుస్తాడు. స్త్రీ స్వాతంత్ర్యము, స్త్రీ విద్య, వైయక్తిక ప్రవృత్తినిబట్టి మంచిఫలితాల్నీ, చెడ్డఫలితాల్నీ యిస్తూ క్రొత్త సమస్యల్ని సృష్టిస్తాయనడానికి యిది గుర్తు. రామయ్య రామాబాయిని 'ప్రేమించి' పెళ్లిచేసుకున్నాడనడానికి వీల్లేదు; అలా కాదనడానికీ వీల్లేదు. 'ప్రేమ' అనే ఆదర్శం రత్తమ్మవంటి వాళ్ల చేతుల్లో అప్పటికే ఒక 'లౌక్యం'గా, కట్నం యివ్వలేని పెళ్లికి 'సాధనం'గా తయారైపోయింది! 1927 లో

నవల వ్రాస్తూ ఈ విషయాన్ని చక్కగా చిత్రించినందుకు రచయిత అభినందనీయుడు. రామయ్యలో, పాపారావులో 'చదువుకున్నవాళ్లమ'నే ఆత్మాభిమానమూ, తద్వారా వారిలో కనిపించే నైతికదార్ఢ్యమూ, (Moral strength) మనకు కాస్త వింతగాకూడా కనిపించవచ్చు! కారణం 'చదువు' బాగా విస్తరించడం ద్వారా నేడు దాని విశిష్టతాపోయింది, దానినుంచీ కలిగే నైతికమైనపుష్టి ఏమీ ఎక్కడా కనిపించటం లేదు!

కనకమ్మ బాలవితంతువు కాదు, కట్టుతప్పిన పిల్ల. ఆనందరావు అను యువకునిచే మోసగింపబడి తనకు కలిగిన కొమార్తెను అక్కగారికి అప్పగించి, తదుపరి నారాయణరావును సంస్కరణ వివాహం చేసుకొన్నదామె. ఆమెలో సుగుణం—ఆమె తన చరిత్రను నారాయణరావుకు చెప్పడం! అంతకంటె ముఖ్యం ఆమె అదృష్టం—నారాయణరావు పెద్దమనసుతో ఆమెను ఆదరించడం, ప్రేమించడం, గౌరవించడం! ఆ కనకమ్మ కొమార్తె సుశీల. సుశీలతో కనకమ్మ అక్కగారు పేదరికంలో శ్రీరాములు అనే న్యాయవాది యిల్లుచేరుతుంది. ఆ దంపతులకు పిల్లలులేక వాళ్ళు సుశీలమీద మమకారం పెంచుకోవడం, సుశీలనుపెంచి పెద్దదాన్నిచేసి చదువు చెప్పించడం, చిట్టచివర సుశీల కనకమ్మను తన తల్లిగా తెలుసుకోవడం — ఊహించడానికీ కథలో సుఖంగా చదువుకోవడానికీ బాగుండే విషయాలు;వాస్తవికత అంతసుఖప్రదంగా ఉండదుమరి, కనీసం చాలమంది అనాథబాలికలపట్ల!

పై రెండు కుటుంబాలకూ అంటె 'విలన్' ఆనందరావు. ఆనందరావు సుశీలకే కాదు తండ్రి! పుల్లమ్మ (ఈమెపేరు తర్వాత సుబ్బమ్మగా పేర్కొనబడింది నవలలో, బహుశా పొరపాటు కావచ్చు) అనే మరొక కన్యను ఆనందరావు చేరదీసి అన్యాయం చేసి ఉండడం మూలంగా, అతను రామయ్యకు (రత్తమ్మ అల్లుడు)కూడా తండ్రి! ఇలా చల్లగా పితృత్వం వహించి బాధ్యతలకు దూరమై, 'సన్న్యాసం' స్వీకరించి, రామానందస్వామిగా, సంఘంలో సదాచారం సంరక్షించే సనాతనుడిగా వీరేశలింగంగారికి తరచు అడ్డుతగులుతూ వుంటాడు ఆనందరావు. నవలలో చివర కనకమ్మకూ అతనికీ జరిగిన సంవాదంలో పాత్రపోషణ, ఔచిత్యం చక్కగా పాటించబడ్డాయి. అంతేకాదు ఆ సంఘటనలో, కనకమ్మ సాహసమూ ఆనందరావు కర్కశత్వమూ ఢీకొని కనకమ్మ విజేత కావడం ఆనాడు సంస్కరణకూ సంప్రదాయానికీ ఏర్పడిన ఘర్షణలోని పరమార్థ మేమిటో (మానవత్వానికీ దురన్యాయానికీ ఘర్షణ) దాన్ని నాటకీయంగా వ్యక్తం చెయ్యడం జరిగింది. ఇది నవలలో పతాక సన్నివేశం అనడంలో సందేహంలేదు! ఈ ఘర్షణ నేటికీ ఉన్నదే!

వీరేశలింగంగారిపేర హైస్కూలుస్థాపించబడటం, సంఘంలో విద్యాభిమానం పెరుగుతూ వుండటం, విద్య అంటే సంస్కారానికీ సత్ప్రవర్తనకూ మొదటి మెట్టు అన్న విశ్వాసం నెలకొనివుండటం, నవలలో మనం గమనించే మరొక విషయం. కాని ఆనాడు కూడా మగవిద్యార్థులు ఆడపిల్లలను ఏడిపించడం, వీలుచూచుకొని వాళ్లమీద అత్యాచారం చెయ్యడం ఉండేదని ఈ నవలలో ఒకానొక సన్నివేశంద్వారా తెలుస్తుంది. పోనీ ఆనాడు స్త్రీవిద్య ఒక వింతగా కనిపించడమే అందుకు కారణమని సరిపెట్టుకోవాలన్నా, ఈనాటికీ పరిస్థితిలో మార్పు కనిపించడం లేదు! ఇలాంటి సమస్యల్ని కేవలం విద్యాసంస్థల్లో క్రమశిక్షణకు సంబంధించిన సమస్యలుగా పరిగణించడానికి వీల్లేదు. వీరేశలింగంగారివంటి ఉపాధ్యాయుడూ, ఆదర్శప్రాయుడూ శిష్యులతో అక్కడ ఉండగానే ఒకానొక విద్యార్థి ఒక బాలికమీద అత్యాచారం చేసి, పైగా "ఇవన్నీ మీా కెందుకండీ? దోవన పోయేవారు పోక? పొరబాటున చేయితగిలితే దానికేం తంటా యేమిటి? ఇరుకుసందు. అందులో చీకటి" అంటూ దబాయిస్తాడు! [పుటలు 255—256] ఇది ఆనాటినుంచీ ఈనాటివరకూ సమస్యగానే ఉన్నదంటే, ఇలాంటివి జాతిలక్షణాలనీ, కేవలం ఉపాధ్యాయులమీదా విద్యావిధానంమీదా నెపం పెడితే పోయేవికావనీ అర్థమవుతుంది!

ఈ నవలలో సంభాషణలు సహజవ్యావహారికంలో సజీవంగా ఉన్నాయి. కథాకథనానికి ఉపయోగించిన భాష ఆనాటినవలల్లో వాడబడిన సరళగ్రాంథికం.

## మజిలీ

[నవల. రచన: ఇచ్ఛాపురపు రామచంద్రం. ప్రచురణ: విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ—2. వెల: రు. 3—50. పుటలు: 212]

'నేడు కళాశాలల్లో స్థితిగతులనూ, విద్యా విధానాన్నీ వాస్తవికంగా వర్ణించే ప్రయత్నమే ఈ నవల' అంటూ ప్రకాశకులు పాఠకులకి తమ 'మాట'గా చెప్పి మరీ నివేదించుకున్నారు. కాలేజీలో 'సమ్మె'కు సన్నాహాలు జరుగుతున్న సందర్భంతో ప్రారంభమౌతుంది కథ; క్లాసులో కుదురుగా కూర్చోక పవ్వళించబోయిన శాస్త్రి అనే విద్యార్థిని రావ్ అనే అధ్యాపకుడు మందలించి బయటికి వెళ్ళిపొమ్మని అన్నందుకు, ఆ అధ్యాపకుడు క్షమాపణ చెప్పకుంటేగాని వీల్లేదని విద్యార్థి ప్రతినిధులు 'సమ్మె' నోటీసు యిస్తారు! శ్యామసుందర్ అనే మరొక అధ్యాపకుడు, రాజీచెయ్యడానికి ప్రయత్నిస్తూ విద్యార్థులను ఒకరోజు సమ్మె వాయిదా వేసుకొమ్మని అర్థించి 'ముద్దాయి' అయిన అధ్యాపకుణ్ణి క్షమాపణ చెప్పేందుకు ఒప్పిస్తానని హామీ యిస్తాడు. చివరకు అతనిచేత ఒకక్షమాపణ పత్రంమీద సంతకం పెట్టిస్తాడుకూడా. 'నీకే జ్ఞానం రాని పసివాడుండి నీ గుండెలమీదపరుండి కాలితో తన్ని ఆడుకుంటే నువ్వు కోపంతెచ్చుకోగలవా? ఆలోచించు రావ్' అనేది శ్యామసుందర్‌యొక్క గొప్ప ఆర్గ్యుమెంట్! క్షమాపణ పత్రంలో విద్యార్థులు సంతృప్తిపడరనీ తనను 'స్టేజీ ఎక్కించి'గానీ తృప్తిపడరనీ రావ్ అంటాడు. ఇంతలో శాస్త్రి అకారణంగా రావ్‌మీద సూటిగా రాయి రువ్వి అతణ్ణి గాయపరచి, ఆస్పత్రికి పంపడంతో కథ రావ్‌కి అనుకూలంగా తిరుగుతుంది. చివరకు రావ్ శాస్త్రిని క్షమించడంతో పరిస్థితులు సర్దుకుంటాయి. ఈ ఉదంతంద్వారా నేటి కాలేజీల్లో వాస్తవిక స్థితిగతులను అర్థం చేసుకోవచ్చును. నిజంగా అధ్యాపకునికి నేడు జరుగుతున్న అన్యాయానికి యిది మచ్చుతునకే! సందేహంలేదు! కాని వచ్చిన చిక్కల్లా ఎక్కడంటే రచయితకు ఒక సన్నివేశాన్నిగాని, దాని పరిణామాన్నిగాని, అందలి పాత్రలనుగాని సహజంగా, నమ్మదగినట్లుగా, చిత్రించే నేర్పులోపించడం:— శ్యామసుందర్‌కు రచయిత అంటగట్టిన 'ప్రయోజకత్వం' ఎటువంటిదో రుజువుకాలేదు! అధ్యాపకుడైన రావ్ మనస్తత్వం ఏమిటో మనం పోల్చుకోలేము. అధ్యాపకుణ్ణి లొంగదీసి తనే విజేత అయ్యే అవకాశం ఉన్నప్పుడు శాస్త్రి అనే ఆ విద్యార్థి రాయి రువ్వడం ఎందుకో ఆ మనస్తత్వం నిరూపింపబడలేదు. ఇందులో ఎక్కడలేని ప్రాధాన్యం ఎటువంటి పలుకుబడీలేని శ్యామసుందర్‌కు ఉన్నట్లు చూపించడం, కాలేజికమిటీ విద్యార్థి ప్రతినిధివర్గం, ప్రిన్సిపాల్, అతను చెప్పిన మాటల్ని అడుగడుగునా శిరసావహించినట్లు చిత్రించడంచూస్తే రచయితకు యథార్థాన్ని ఉపలక్షించే దృష్టి, వాస్తవికతను గూర్చిన ఇంగితజ్ఞానం యింకా ఏర్పడలేదనుకోవాలి. నవలలోని మిగతా విషయాలుకూడా రచయిత విహరిస్తున్న కాల్పనిక (Romantic, స్వాప్నిక ప్రపంచాన్నీ, అక్కడ ఉద్భూతమయ్యే విలువల్నీ మాత్రమే నిరూపిస్తున్నాయి, శ్యామసుందర్, శారద, జగన్మోహన్‌ల మధ్య నడిచిన ప్రేమ, త్యాగం, ఆరాధన వగైరాల రొమాంటిక్ గాథ నట్టి 'భావోల్బణపు నురగ' (Senfimental froth) తప్ప అందులో మరేమీ లేదు. రచయిత దృష్టిలో ఆదర్శప్రాయుడైన అధ్యాపకుడు శ్యామసుందర్‌కూడా తన అధ్యాపకవృత్తిని ఒక 'మజిలీ' గానే భావించి, సినిమాలకు స్క్రిప్టు వ్రాసే ఉద్యోగాన్ని స్వీకరిస్తూ మద్రాసు వెళ్ళడంతో నవల ముగిసింది. మరి కళాశాలల గతేంకాను? నేటి విద్యార్థులమీదేకాదు, ఈ రచయితమీదకూడా సినిమా ప్రభావం పుష్కలంగా ఉన్నట్లు రుజువు చేస్తున్న దీ నవల. సినిమా కథల్లో ప్రధాన కథకు ఒక ఉపకథ—హాస్యం (అంటే వెకిలిదనం) ప్రధానమైన ఉపకథ, అనివార్యంగా ఉంటున్న రీతిగానే శ్యామసుందర్— శారదల ప్రధాన కథకుమురళి — ఇందిరల

ఉపకథ ఒకదాన్ని జోడీ కుదిర్చాడు రచయిత... సౌందర్యం, లాలిత్యం, ఉదాత్తత, గంభీరత—వీటి కోసం అఱులు చాచే యువతరం వారి మనస్సుకి ఇటు కళాశాలలూ అటు సినిమాలూ సరియైన ఆలంబనం కాకపోవడం, ఉపాదేయము లభించక పోవడం, నేటి శోచనీయ పరిస్థితి: ఆ పరిస్థితికి తార్కాణ ఈ నవల.

## విడీవిడని చిక్కులు

[నవల. రచన: వీరాజీ. ప్రచురణ; యం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు, మచిలీపట్టణము, సికింద్రాబాడ్. వెల: రు. 2—50 పుటలు: 183]

ఆంధ్రదేశంలో సామాన్య స్థితిగతులకు చెందిన బ్రాహ్మణకుటుంబాల్లో ఏర్పడుతున్న 'చిక్కుల్ని' గురించి మంచి అవగాహనతో, ఆపేక్షా, అంతఃకరణా గల యువకుడు వ్రాసిన నవల యిది. ఈ 'చిక్కులు' కేవలం ఆర్థికమైనవికావు. ఆర్థికమైన కారణాలకు తోడు, వాటికంటె ప్రధానంగా, యువతరం వారి జీవితాల్ని అడకత్తెరలో నొక్కివేస్తున్న శక్తులు: వ్యక్తుల మనోవైఖరికీ, సంస్కారానికీ సంబంధించినవి. ఇందులో మగవారికంటె స్త్రీలు వహించవలసిన బాధ్యత ఎక్కువగా ఉంది., ఇది సంఘ సంస్కరణకు చెందిన విషయమూకాదు. వ్యక్తిగతంగా కొంత సహనమూ, జాలీ, సానుభూతీ పెంపొందించుకుంటే చాలు, ఈ మనుష్యుల్లో ఈ సంసారాల్లో సుఖమూ సంతోషమూ ఎంతో అభివృద్ధిచెందే అవకాశం ఉన్నట్లు కనిపిస్తుంది. కాని అదే లోపిస్తోంది! ఇదంతా అవలోకించి, అర్థంచేసుకునే నిశితమైన పరిశీలనా, ఆర్ద్రమైన హృదయమూ ఉన్న ఒక యువకుడు, ఎవరి కష్టమని తీర్చగలడు, ఎవరి కన్నీరని తుడవగలడు? చిక్కులన్నీ, అందరినీ, ఒక్కసారిగా విడిపోతే బాగానే వుంటుంది! కాని అలా జరగడం తన ఒక్కడి చేతిలోలేదని గుర్తించడమే, ఈ నవల ముగింపు విషాదాంతం కావడానికీ, నవల పేరు 'విడీవిడని చిక్కులు' కావడానికీ, కారణం.

కథానాయకుడు సూర్యం యువకుడు; గుమాస్తా ఉద్యోగం చేస్తున్నా, ఇంకా బామ్మసంరక్షణలోనే ఉంటూన్న అవివాహితుడు; ఎటువంటి సమస్యలూ లేనివాడు. అందుకే అందరి సమస్యలూ, ముఖ్యంగా ఆ లోగిలిలో ఉన్న ఐదు వాటాలలోని కుటుంబాల సమస్యలూ, ఆఫీసులో హెడ్ గుమాస్తా కుటుంబం సమస్యా, అతనివే అయినవి. అంటే మానసికంగా మాత్రమే; వాళ్ల వ్యవహారాల్లో జోక్యం చేసుకునే తత్త్వంకాదు అతనిది. పదమూడేళ్ల అమ్మాయి రాజ్యలక్ష్మికి సూర్యందగ్గరా అతనిబామ్మ నరసమ్మ దగ్గరా చనవు. రాజ్యలక్ష్మి సాంబశివం కూతురు; వివాహానికి పూర్వం కలిగిన అక్రమ సంతానం; సాంబశివం వదినె, ఔదార్యంతో రాజ్యలక్ష్మిని తన బిడ్డగా పెంచి, మరణిస్తూ, సాంబశివం భార్య లలితాంబకు అప్పజెప్పగా, విధిలేక ఆపిల్లభారం వహిస్తున్నది లలితాంబ. చివరకు రాజ్యలక్ష్మి జన్మవృత్తాంతం, దూరపు బంధువులైన యిద్దరు విధవరాండ్రు, స్వప్రయోజనం నిమిత్తం, లలితాంబ చెవిలో ఊదుతారు. లలితాంబ రాజ్యలక్ష్మిద్వారా 'అనాచారం' 'భ్రష్టత్వం' ప్రాప్తించినట్లు భావిస్తుంది; ఆ రహస్యం నలుగురికీ తెలిసిపోకుండా ఆ విధవరాండ్రు చెప్పిన ఒక ముదివగ్గుకు రాజ్యలక్ష్మిని కట్టబెట్టి తన సంతానంయొక్క భవిష్యత్తుని భద్రపరచుకోవాలనుకుంటుంది. ఇందులో సవతి మాత్సర్యమూ, రాజ్యలక్ష్మికోసం ధనం వ్యయం చెయ్యనీకపోవడమూ రెండూ కలిసి ఉన్నాయి రాజ్యలక్ష్మి సుగుణాల రాశి. రచయిత ఆ అమ్మాయికి జీవంపోసి, మాటల్లో, చేతల్లో, కదలికల్లో, ఒక అమృత మూర్తిగా తీర్చిదిద్దాడు. రాజ్యలక్ష్మి గతి ఏంకావాలి? ఆమె 'చిక్కు' ఎలా విడిపోవడం? రాజ్యలక్ష్మి తన కొమార్తె అంటూ భార్యతోచెప్పి ఆ అమ్మాయికి న్యాయం చేకూర్చేధైర్యం సాంబశివంలో లేదు; తన బిడ్డగా చెప్పినమాటనింటూ పెరిగిన రాజ్యలక్ష్మి సుఖ ధుఃఖాలు రవంతైనా ఆలోచించే ఔదార్యం, కాదు మానవాంశకూడా లలితాంబలో లేదు. సూర్యం తను రాజ్యలక్ష్మిని వివాహం చేసుకుంటానని ముందుకు రావడంద్వారా ఈ సమస్య పరిష్కారం కావాలా?

"ఒకకుటుంబంలో ఒకరి తప్పిదానికి మిగిలిన అందరూ నైతికంగా కట్టుబడి ఉండాల్సిందేనా? ఒకరు తప్పుచేస్తే శిక్ష మరొకరికా?" అని ప్రశ్నిస్తుంది నిర్మల. నిర్మల కుటుంబ సంప్రదాయాన్ని విమర్శించి ఆమెను కట్టుకున్న భర్త ఆమెను తిరస్కరించాడు. నిర్మల వితంతువుగా వ్యవహరిస్తూ ఆలోగిట్లో

ఉపకథ ఒకదాన్ని జోడీ కుదిర్చాడు రచయిత... సౌందర్యం, లాలిత్యం, ఉదాత్తత, గంభీరత—వీటి కోసం అఱులు చాచే యువతరం వారి మనస్సుకి ఇటు కళాశాలలూ అటు సినిమాలూ సరియైన ఆలంబనం కాకపోవడం, ఉపాదేయము లభించక పోవడం, నేటి శోచనీయ పరిస్థితి: ఆ పరిస్థితికి తార్కాణ ఈ నవల.

## విడీవిడని చిక్కులు

[నవల. రచన: వీరాజీ. ప్రచురణ; యం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు, మచిలీపట్టణము, సికింద్రాబాడ్. వెల: రు. 2—50 పుటలు: 183]

ఆంధ్రదేశంలో సామాన్య స్థితిగతులకు చెందిన బ్రాహ్మణకుటుంబాల్లో ఏర్పడుతున్న 'చిక్కుల్ని' గురించి మంచి అవగాహనతో, అపేక్షా, అంతఃకరణా గల యువకుడు వ్రాసిన నవల యిది. ఈ 'చిక్కులు' కేవలం ఆర్థికమైనవికావు. ఆర్థికమైన కారణాలకు తోడు, వాటికంటె ప్రధానంగా, యువతరం వారి జీవితాల్ని అడకత్తెరలో నొక్కివేస్తున్న శక్తులు: వ్యక్తుల మనోవైఖరికీ, సంస్కారానికీ సంబంధించినవి. ఇందులో మగవారికంటె స్త్రీలు వహించవలసిన బాధ్యత ఎక్కువగా ఉంది., ఇది సంఘ సంస్కరణకు చెందిన విషయమూకాదు. వ్యక్తిగతంగా కొంత సహనమూ, జాలీ, సానుభూతీ పెంపొందించుకుంటే చాలు. ఈ మనుష్యుల్లో ఈ సంసారాల్లో సుఖమూ సంతోషమూ ఎంతో అభివృద్ధిచెందే అవకాశం ఉన్నట్లు కనిపిస్తుంది. కాని అదే లోపిస్తోంది! ఇదంతా అవలోకించి, అర్థంచేసుకునే నిశితమైన పరిశీలనా, ఆర్ద్రమైన హృదయమూ ఉన్న ఒక యువకుడు, ఎవరి కష్టమని తీర్చగలడు, ఎవరి కన్నీరని తుడవగలడు? చిక్కులన్నీ, అందరినీ, ఒక్కసారిగా విడిపోతే బాగానే వుంటుంది! కాని అలా జరగడం తన ఒక్కడి చేతిలోలేదని గుర్తించడమే, ఈ నవల ముగింపు విషాదాంతం కావడానికీ, నవల పేరు 'విడీవిడని చిక్కులు' కావడానికీ, కారణం.

కథానాయకుడు సూర్యం యువకుడు; గుమాస్తా ఉద్యోగం చేస్తున్నా, ఇంకా బామ్మసంరక్షణలోనే ఉంటూన్న అవివాహితుడు; ఎటువంటి సమస్యలూ లేనివాడు. అందుకే అందరి సమస్యలూ, ముఖ్యంగా ఆ లోగిలిలో ఉన్న ఐదు వాటాలలోని కుటుంబాల సమస్యలూ, ఆఫీసులో హెడ్ గుమాస్తా కుటుంబం సమస్యా, అతనివే అయినవి. అంటే మానసికంగా మాత్రమే; వాళ్ల వ్యవహారాల్లో జోక్యం చేసుకునే తత్త్వంకాదు అతనిది. పదమూడేళ్ల అమ్మాయి రాజ్యలక్ష్మికి సూర్యందగ్గరా అతనిబామ్మ నరసమ్మ దగ్గరా చనవు. రాజ్యలక్ష్మి సాంబశివం కూతురు; వివాహానికి పూర్వం కలిగిన అక్రమ సంతానం; సాంబశివం వదినె, ఔదార్యంతో రాజ్యలక్ష్మిని తన బిడ్డగా పెంచి, మరణిస్తూ, సాంబశివం భార్య లలితాంబకు అప్పజెప్పగా, విధిలేక ఆపిల్లభారం వహిస్తున్నది లలితాంబ. చివరకు రాజ్యలక్ష్మి జన్మవృత్తాంతం, దూరపు బంధువులైన యిద్దరు విధవరాండ్రు, స్వప్రయోజనం నిమిత్తం, లలితాంబ చెవిలో ఊదుతారు. లలితాంబ రాజ్యలక్ష్మిద్వారా 'అనాచారం' 'భ్రష్టత్వం' ప్రాప్తించినట్లు భావిస్తుంది; ఆ రహస్యం నలుగురికీ తెలిసిపోకుండా ఆ విధవరాండ్రు చెప్పిన ఒక ముదివగ్గుకు రాజ్యలక్ష్మిని కట్టబెట్టి తన సంతానంయొక్క భవిష్యత్తుని భద్రపరచుకోవాలనుకుంటుంది. ఇందులో సవతి మాత్సర్యమూ, రాజ్యలక్ష్మికోసం ధనం వ్యయం చెయ్యనీకపోవడమూ రెండూ కలిసి ఉన్నాయి రాజ్యలక్ష్మి సుగుణాల రాశి. రచయిత ఆ అమ్మాయికి జీవంపోసి, మాటల్లో, చేతల్లో, కదలికల్లో, ఒక అమృత మూర్తిగా తీర్చిదిద్దాడు. రాజ్యలక్ష్మి గతి ఏంకావాలి? ఆమె 'చిక్కు' ఎలా విడిపోవడం? రాజ్యలక్ష్మి తన కొమార్తె అంటూ భార్యతోచెప్పి ఆ అమ్మాయికి న్యాయం చేకూర్చేధైర్యం సాంబశివంలో లేదు; తన బిడ్డగా చెప్పినమాటవింటూ పెరిగిన రాజ్యలక్ష్మి సుఖ ధుఃఖాలు రవంతైనా ఆలోచించే ఔదార్యం, కాదు మానవాంశకూడా లలితాంబలో లేదు. సూర్యం తను రాజ్యలక్ష్మిని వివాహం చేసుకుంటానని ముందుకు రావడంద్వారా ఈ సమస్య పరిష్కారం కావాలా?

"ఒకకుటుంబంలో ఒకరి తప్పిదానికి మిగిలిన అందరూ నైతికంగా కట్టుబడి ఉండాల్సిందేనా? ఒకరు తప్పచేస్తే శిక్ష మరొకరికా?" అని ప్రశ్నిస్తుంది నిర్మల. నిర్మల కుటుంబ సంప్రదాయాన్ని విమర్శించి ఆమెను కట్టుకున్న భర్త ఆమెను తిరస్కరించాడు. నిర్మల వితంతువుగా వ్యవహరిస్తూ ఆలోగిట్లో

ఒకవాటాలో కాపురం ఉంది. ఆమె చరిత్ర విచారించకుండానే సూర్యం, రాజ్యలక్ష్మి ప్రోత్సాహం వల్ల, ఆమెకు సహాయం చేస్తాడు.కాని నిర్మల సమస్య ఎలా పరిష్కారం కావాలి ? సూర్యంబామ్మ నిర్మల పట్ల చూపించే సానుభూతి మిగతావాళ్ళ చూపించరు. వాళ్ళు నిర్మల రహస్యం ఏమిటో తెలుసుకోవడానిక్కీ, ఆమె ప్రవర్తనమీద అభాండాలు వెయ్యడానికీ కాచుక్కూచున్నారు. వాళ్లలో లోపించింది సహనమూ ఔదార్యమే ! వాళ్లలో ఒకరు 'నిరంజనంగారి విధవప్ప చెల్లెలు' అనబడే వ్యక్తి. ఆమె యింట్లో చేసేపెత్తనానికి మేనల్లుడు యింటిముఖమే చూడడు ; అతని భార్య కుమిలిపోతూవుంటుంది ! ఈసమస్యకు పరిష్కారం ఎప్పటికి ? ఆ 'విధవప్ప చెల్లెలి'కి తన దౌష్ట్యం తన కెప్పటికి తెలిసివస్తుంది ?

మరొక వాటాలో సుభద్రమ్మా వెంకటరత్నం దంపతులు—భర్తకు ఎక్కడలేని ఆచారం; పైగా అతనికి భార్యమీద ఎప్పుడూ అనుమానం; ఆమె ఎవరితోనూ మాట్లాడకూడదు. నిత్యమూ భార్యాభర్తల మధ్య పోట్లాటలే ! ఆ భర్తలో లోపించింది ఔదార్యమే !

సూర్యం ఆఫీసులో హెడ్ గుమాస్తా శంకరంగారికి సంతానం ఆరుగురు ఆడపిల్లలు. శంకరంగారి సౌహార్దానికి ముగ్ధుడై సూర్యం అతని యింటికి వెళ్తాడు, తీరికసమయంలో చిన్నవాళ్ళైన చివరి అమ్మాయిలకి చదువూ చెబుతాడు. ఇది శంకరం భార్య జానకమ్మలో ఆశను రేకెత్తిస్తుంది; ఆఫీసులో తోటి గుమాస్తా మంగపతి వెకిలిమాటలకూ కారణమౌతుంది! శంకరంగారి పెద్దమ్మాయి ఇంటరీమీడియేటు ప్యాసైంది. తగిన సంబంధం 'కొనగల' తాహతు ఆయనకులేదు. .సూర్యం ఆ అమ్మాయిని చేసుకోవటానికి ప్లాను కున్నా, శంకరం సమస్య ఏమి తీరినట్లు? మిగతా ఆయిదుగురికీ ఎలా అవుతాయి పెళ్ళిళ్ళు?

పోతే, సూర్యానికీ ఉంది ఒక చిక్కు. సూర్యం తండ్రి ఇంట్లోంచి లేచిపోయాడు ఎవర్తెనో తీసుకుని. అతని అక్కయ్యా అలాంటిపనే చేసింది. సూర్యంబామ్మ ఈ 'అప్రతిష్ఠ'ను ఎలాగైనా తుడిచిపెట్టి సూర్యానికి మంచి సంప్రదాయంగల కుటుంబంలో పెళ్ళిచెయ్యాలని చూస్తోంది. మేనమామ జయరావు తన కూతురు మీనాక్షిని కట్టబెట్టాలని వస్తాడు. అతని ఉద్దేశం 'అప్రతిష్ఠ'ను తెలివిగా ఉపయోగించుకుంటే, కట్నం విషయంలో సులువుగా ఉంటుందనీ, సూర్యం, సూర్యంబామ్మా, తనచెప్పు చేతల్లో ఉంటారనీ ! ఈ విషయం గ్రహించిన సూర్యానికి మేనమామంటే యిష్టంలేదు. బంధుత్వాన్ని పురస్కరించుకుంటే హృదయాలు కలిసే అవకాశం ఉన్నచోట, జయరావు చూపే 'లౌకికం' ఒక ప్రతిబంధకమే అవుతుంది. మేనమామ కూతురు మీనాక్షి మాత్రం సూర్యాన్ని ఆకర్షిస్తుంది—ఆ అమ్మాయి చక్కనిదీ, చదువుకున్నదీ, పైగా ఇంగితజ్ఞానమూ, ఔదార్యమూ గల వ్యక్తిగా రుజువు చేసుకున్నదీ. ఆ అమ్మాయిని చూచి మేనమామనూ భరించటానికి సూర్యం అంగీకరిస్తాడు. కాని యింతలో రాజ్యలక్ష్మికి జరగబోతున్న 'ముదివగ్గుతోడిపెళ్లి' అతని మనస్సు అతనికి తెలిసేలా చేస్తుంది. పరిష్కారంగా రాజ్యలక్ష్మిని తనే పెళ్లాడతానని బామ్మతో చెబుతాడు. సంప్రదాయాన్ని ముఖ్యమైన విలువగా పట్టుకుని ప్రాకులాడుతున్న బామ్మకు సూర్యం కోరిక తీర్చడమంటే సంప్రదాయాన్ని వదలిపెట్టడమే నని లవగాహన అవుతుంది. సూర్యంకోసం, రాజ్యలక్ష్మికోసం, మానవత్వంకోసం, ఆమె అందుకు సిద్ధపడుతుంది. అయితే బామ్మగారు నిర్ణయానికి వచ్చేటప్పటికే సమయం దాటిపోయింది! ఆ రాత్రే రాజ్యలక్ష్మి బావిలో దూకి ఆత్మహత్య చేసుకుంది! ఆ రాత్రే నిర్మల—సూర్యం తండ్రీ తన తండ్రీ ఒక్కరేననీ గ్రహించి, ఆ రహస్యం తెలిస్తే బామ్మ తనకి ఆదరం చూపదనే అభిప్రాయంలో— అక్కడినుంచి వెళ్లిపోతుంది! అందువల్ల బామ్మ ఔదార్యం సంప్రదాయాన్ని వదలుకోవాలనే ఆమె నిర్ణయం, 'చిక్కుల్ని' విడీవిడనట్లుగానే ఉంచేశాయి! నవల ముగింపు సుఖాంతంచేసి, చిక్కుల్ని విడగొట్టనందుకు కారణం రచయిత యిలా చెప్పాడు— ''ముఖ్యంగా యిక్కడ కావల్సింది ముగింపుకాదు. మార్పు అనుకుంటాను. అది రావల్సినచోటు వేరే ఉన్నది. సమాజమే అది.'' కథలోని బామ్మ ఒక్కర్తేలోకాదు, సమాజంలోని 'బామ్మ' అందరిలో సంప్రదాయాన్ని వదలుకునే సాహసం, 'మానవత్వా'

నికి విలువ యిచ్చే మార్పు, వచ్చినప్పుడే 'కథ'— అంటే సామాజిక జీవితం—సుఖాంతం అవుతుందనీ; అంతదాక నవలని సుఖాంతం చేసి లాభంలేదనీ రచయిత ఉద్దేశం. రచయిత అభినందనీయుడు!

—ఆర్. ఎస్.

## గు ర జా డ

['గురజాడ'; రచన: శ్రీ శ్రీ; ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ—2; పేజీలు: 67; వెల: రు 1—25]

ఒక మహాకవి రచనలలోని గొప్పతనాన్ని పరామర్శిస్తూ మరొక మహాకవి వ్రాసిన విమర్శ యిది. గ్రంథం చిన్నదైనా తెలుగు వాఙ్మయ విమర్శలోనే విశిష్టస్థానాన్ని గడించుకొనే రచన యిది. విమర్శరచన సృజనకంటె తీసిపోయింది కాదని భావిస్తే యీ రచన సృజనాత్మక విమర్శ. మహాకవి గురజాడ ముత్యాల సరాలలోని ఆణిముత్యాలను విలువగట్టటానికి వజ్రాల వర్తకులక్కరలేదు. కాని దురదృష్టవశాత్తు ఆధునిక సాహిత్యసౌందర్యానికెంతో దూరమైన, పోతరాతి యుగాల అవశేషాల సారమైన అవహేళన గురజాడ విషయంలో చెలరేగింది. ఐతే శ్రీ కృష్ణశాస్త్రిగారన్నట్లు గురజాడ మరణించింది 1915 లో నైనా, నిజానికి ఆ తర్వాతే అతడు జీవించటం ప్రారంభించాడు. సాహిత్యంలో నవచైతన్యం ననలెత్తినా, దుద్దుకట్టులతో పెత్తనంచేసే పండితులూ, కవి కంఠపాశాలూ, కవి సర్పగారుడాలూ అనేపేర్లతో విమర్శచేసిన లాక్షణిక మహాశయులను తలదన్నిన మహానుభావులూ గురజాడను 'అకవి' అన్నారు. ''కొయ్యబొమ్మలె మెచ్చువారలకు కోమలుల సౌరెక్కునా'' అనే మహాకవి వాక్యంలో సరిపెట్టుకోజూస్తే కువతులు 'కుకవి' అని కూడ అన్నారు. ''నల్లమందుకే గాని కళ్లిప్ప''ననే నల్లమందు భాయీలను ఉపేక్షామాత్రంగానే దండించి, కవాటాలు తెరచుకొని ప్రవహించే మహా ప్రవాహాన్ని మున్ముందుకు కొనసాగనిద్దాం. మరైతే ఈ విమర్శ గ్రంథం ఎందు అనే ప్రశ్నకు శ్రీ శ్రీ యీ పుస్తకంలోనే జవాబు చెప్పారు. ''ఒకందుకు నాకు విచారం వేస్తుంది. తమిళులు తమ జాతీయకవిగా సుబ్రహ్మణ్య భారతిని కంగీకరిస్తారు. మళయాళీలకు వల్లథోల్ వున్నాడు. వంగీయుల మహాకవి రవీంద్రనాథఠాకూరు. అలాగే ఇతర ప్రాంతాలకు యితర కవులు. కాని తెలుగులో మాత్రం తమ జాతీయకవి విషయమై తెలుగువారు ఏకాభిప్రాయానికి రాలేకపోతున్నారు.'' రాజకీయాలలో వలె సాహిత్యంలోనూ బహునాయకత్వం తప్పలేదని మహాకవి గురజాడ మన జాతీయకవి అని తెలియ జెప్పటానికి ప్రయత్నించారు.

''నూటికి నూరుపాళ్ళు తెలుగుకవిగా ఇంట గెలుచుకొని సార్వజనీన సార్వకాలీన విశిష్టత్వంతో రచ్చగెలువగలిగినవాడు వేమన్న ఒక్కడే వెనుకటి కాలంలో తెలుగుకవి. అలాగే ఆధునిక సాహిత్య ప్రపంచంలో తెలుగుదేశపు సరిహద్దుల కవతల అంతర్జాతీయ కవిసమ్మేళనంలో తెలుగువారి తరఫున ప్రతినిధిగా నిలుచుకోగలిగినవాడు గురజాడ అప్పారావు వొక్కడే''. కవిగా, కథకునిగా, నాటకకర్తగా గురజాడకూ మిగిలిన కవులకు మశకహస్త్యంతరం ఉన్నట్లు నిరూపించారు. భారతభూమి కావల పర్యటిస్తున్న మహాకవి ''ఇదీ మా తెలుగు కవిత్వం'' అని చెప్పుకోవలసి వచ్చినప్పుడు పై విధంగా తలంచటంలో ఆశ్చర్యమేముంది? దానికి కారణం వేమన, గురజాడ అంటే శ్రీ శ్రీ కున్న దురభిమానం కాక వాస్తవాన్ని చెప్పాలనే గాఢమైన వాంఛ, అందుకుతోడైన నిర్భీతి, వాస్తవాన్ని వెల్లడించటంలో ఆయన డొంకతిరుగుడు పద్ధతుల నవలంబించక పోవటము.

సామాజిక పరిణామానికి విప్లవపంథాలో వేగం సాధించిన మహాకవిగా, సమాజ ప్రగతికి క్రాంత దర్శియైన పురోగామిగా, భాషకు సంకెళ్ళు విదల్చి స్వేచ్ఛను సాధించి, సరిగ్గా మాట్లాడినట్లే వ్రాయటమనే మహాకార్యాన్ని సునాయాసంగా సాధించిన భాషావేత్తగా, కవిత్వంలో సర్వజనీనతను అప్రయత్నంగా సాధించిన అతడి ప్రతిభాసంపత్తికి శ్రీ శ్రీ యీ పుస్తకంతో నివాళు లెత్తారు. శ్రీ శ్రీ విశదీకరించిన తరువాతగూడ పట్టువిడువని పండితోత్తములుంటే వారిని ఉపేక్షచేయటంతప్ప చేసేదిలేదు.

'ముత్యాల సరాల'కు వ్రాసిన పీఠికలో దేశభక్తి గేయాన్ని శ్రీ శ్రీ ఆకాశాని కెత్తేశారు. కాలం గడిచే కొద్దీ బలం సంతరించుకునే మహాకావ్యాలలో ఒకటిగా దీనిని పరిగణించారు. కావొచ్చు. సమస్త ప్రపంచ

ప్రజల జాతీయగీతంగా 'దేశభక్తి' గీతాన్ని యెంచారు. పాఠకులే ఆలోచించి నిర్ణయించాలి. "రామాయణ భారతాది ఇతిహాసాలకున్న విలువ ఈ ఒక్క గీతానికి ఉందని అంటే కొందరు ఆశ్చర్యం పొందుతారేమో? కాని ఆశ్చర్యకరమైన యథార్థం యిది...ఒక తెలుగు కవి ప్రపంచాని కిచ్చిన కవిత్వపు కానుక యిది. మానవుని ఆధ్యాత్మిక యాత్రలో "భగవద్గీతకు గల ప్రత్యేకస్థానం ఉంది గురజాడకవి "దేశభక్తి" గీతానికి, ఒక కాలానికీ, ఒక స్థలానికీ పరిమితంకాని సందేశం ఇచ్చేది ఈ గీతం. పావురంలాగ ప్రశాంతంగా రవళిస్తూనే సింహంచేసే క్ష్వేళాధ్వనిని స్ఫురింపచేస్తుంది ఈ గీతం. ఏకకాలంలో ప్రభుసమ్మితంగాను, కాంతాసమ్మితంగానూ కూడ మానవత్వాన్ని ఉపదేశించటం ఈ గీతం ప్రత్యేకత." ఈ మాటలు జీర్ణించుకోవటానికి తెలుగు పాఠకులు సిద్ధంగా ఉన్నారా? ఈ సమీక్షకునికి మాత్రం ఈ ప్రశ్నగుర్తు, ప్రశ్నగుర్తుగానే మిగిలిపోతున్నది. పై వాక్యాలు నిజమని తెలుగు పాఠకులెల్లరూ విశ్వసించి, గురజాడను తమ జాతీయకవిగా మన్నించే శుభతరుణం వస్తే తెలుగు కవిత్వాని కంతకంటే సార్థకత మరేముంటుంది?

గురజాడ కవిహృదయాన్ని పూర్తిగా అర్థం చేసుకున్న శ్రీ శ్రీ మాత్రమే "నరకంలో" అనే సంభాషణ వ్రాయగలరు. ఇరువురూ స్వర్గనరకాలను సమంగా చూడగల యోగ్యులు. ఇరువురూ పై అంతస్తుల్లోకి వెళ్ళాలని, త్రొక్కిసలాటలో ముందుకు రావాలనీ కోరుకోని చిత్రమైన గర్విష్ఠులు. 'యశఃకాయాన్ని సంపాదించుకోవాలనే ఉబలాటంతో ఏ రాజునో కీర్తించటమో, ఏ తాజమహాలును చూచి కన్నీళ్ళు కార్చటమో, ప్రకృతి ప్రశాంతశోభలో అతి ప్రశాంతంగా నిద్రించాలనో కోరుకోక, పీడిత తాడిత ప్రజలముందు నిలిచి, ముందుకు నడిపించే మహాయాత్రికులు. "నేను సైతం ప్రపంచాగ్నికి సమిధనొక్కటి ఆహుతిచ్చాను" అని చెప్పగలిగిన చిత్తశుద్ధి ఇరువురిలోనూ కావలసినంత ఉన్నది. అందుకే సహృదయులు వారికవితల్ని చదివినప్పుడు జీవితకాలమంతా జ్ఞాపకం ఉండి, వారిని ముందుకు నడిపించే శక్తులుగా మహాకవు లిరువురినీ జ్ఞాపకం ఉంచుకుంటారు. అందుకే వారి కవిత 'భావికి బాట'. గతించిన కాలపు గొప్పతనానికి మురిసిపోయే మత్తుమందుకాదు.

'సెల్యులాయిడ్‌లో కన్యాశుల్కం' అనే వ్యాసంలో సినిమా టెక్నిక్‌తో ఢక్కామొక్కీలు తిన్న శ్రీ శ్రీ కన్యాశుల్కాన్ని ఫిల్ముగా ఎలా తియ్యాలో చెప్పారు. కాని తీస్తే ఫిల్ము నిర్మాతలు తమదృష్టిలో నష్టపోవటం తప్పదంటున్నారు. ఐనా దమ్ములుంటే కన్యాశుల్కాన్ని సమగ్రంగా అర్థంచేసికొని 'బీభత్సరసప్రధానమైన విషాదాంత నాటకం గాయెంచి' తియ్యాలంటున్నారు. అంతేగాని ధనైకలాభ్యంతో 'కన్యాశుల్కాన్ని' ఒక మ్యూజికల్ 'కామెడీ'గా తియ్యటం దానిని వధించటమే నంటారు. మరి చూస్తూ చూస్తూ నష్టపోవటానికి ఎవరు సిద్ధమౌతారు. ఆ విధంగా ఆర్థికంగా నష్టపోవటమే కళాత్మకంగా లాభాన్ని సాధించటమంటారు. ఆయన మాటల్ని పెడచెవినిపెట్టి కన్యాశుల్కాన్ని 'మ్యూజికల్ కామెడీ'గా తీసినవారు గూడ బావుకున్న దేమీలేదు. పైగా 'కన్యాశుల్కాన్ని 'ఫిల్ము' తియ్యటంలో శ్రీ శ్రీకి గూడ జోక్యం ఉన్నట్లు వినికిడి. 'ఆనందం అర్ణవమైతే' అనే పాటను గూడ కన్యాశుల్కం ఫిల్ములో ప్రవేశపెట్టారు. కన్యాశుల్కాన్ని మ్యూజికల్ కామెడీగా తియ్యటాన్ని 'హర్షించలేనివాడుఈలోకంలో ఒక్కడైనా ఉన్నాడు' అన్న శ్రీ శ్రీ మరి ఆ ఫిల్ములో జోక్యం కల్పించుకోవటం వింతే. కన్యాశుల్కంలోని నాటకీయతను క్షుణ్ణంగా అర్థం చేసికొని, తూచినట్లు 'గిరీశం, రామప్పంతులు లుబ్ధావధాన్లు మొదలైనవారు నవ్వుపుట్టించేటట్లు మాటలాడే ట్రాజిక్ హీరోలు. వీరిది శిథిలీకృతమవుతూన్న ఒకానొక సాంఘిక వ్యవస్థయొక్క కరాళ నృత్యం' అని చెప్పారు. గురజాడవారి రచనలను విమర్శించిన మరెవ్వరూ యింత చక్కగా, సరిగా చెప్పలేదు. ఇంత చక్కటి వివరణను దురదృష్టవశాత్తూ కన్యాశుల్కాన్ని ప్రదర్శిస్తున్న నటులుగాని, గురజాడ నదేపనిగా

పొగడుతున్న స్తోత్రపాఠకులుగాని అర్థంచేసికొన్నట్లు కన్పించదు.

వేసిన దారివెంటనే నడుస్తూ ఆధునికకాలంలో గొప్ప వచన రచనల నందించారు శ్రీ చిన్నయసూరి. 'ఆయన నవీనకాలంలో పరిశేషించిన ప్రాచీనుడు.' కాని గురజాడ వేసిన దారివెంటనడిచే మనస్తత్వం గలవాడుకాడు. నలిగిన బాటవెంట నడువక కొత్తదారుల నేర్పరచుకొనే సాహసికుడు. 'ప్రత్యేకంగా వచన రచనలో ఆయన వాడుకభాషను స్వీకరించి దానిని మహోన్నతమైన స్థాయికి తీసుకువెళ్ళాడు...వ్యావహారిక భాషాస్థాపనకి జరిగిన అనేకానేక యుద్ధాలలో గురజాడవారు సృజనాత్మకమైన రసగోళాలు ప్రయోగిస్తే శాస్త్రీయమైన వ్యూహ నిర్మాణాలతో బాసట ఇచ్చినవారు గిడుగుపంతులు.' గురజాడ వారి వచన రచనలను శ్రీ శ్రీ నాలుగు విధాలుగా విభజించారు. అవి 1. నాటకీయం 2. కథనాత్మకం 3. విమర్శనాత్మకం 4. వ్యక్తిగతం. ఏ శాఖలోనైనా గురజాడవారద్భుతమైన శేముషీవిభవాన్ని ప్రదర్శించారు. విశ్వవిద్యాలయాలు వ్యావహారికాన్ని అంగీకరించటంలో ఒక్కొక్క మెట్టే దిగివస్తున్నాయంటే అది గిడుగు, గురజాడల చలవే అనాలి.

బండబారిపోయిన తెలుగు వచనం గురజాడ స్పృశించినంతనే మిలమిట్లు గొలిపే సుందరమైన ఆభరణాలుగా మారింది. గురజాడ స్పర్శవేది. మన సాహిత్యం తెలుగు సాహిత్యసీమకావల సగర్వంగా సంచరించగలిగిన భాగ్యం గురజాడవలననే, వ్యావహారిక భాషా స్వీకరణద్వారానే కలిగింది.

'ముత్యాలసరం—ఒక కృషి' అనే వ్యాసం సమగ్రమైన విమర్శ వ్యాసం. ఏ కవిని గురించియైనా విమర్శచేసేముందు ఈ వ్యాసాన్ని ఆదర్శంగా ఉంచుకోవలసినంతటి ఉత్తమవ్యాసం. మహాకవుల వాక్కు వెంట ఉత్తమమైన అర్థాలు పరుగిడుతూ వస్తాయని సంస్కృతంలో ఒక సూక్తి ఉన్నది. మహాకవి ఆ అర్థాన్ని ఊహించాడా లేదా అన్నది ప్రశ్నకాదు. ఆ వాక్కులో అంతటి అర్థాన్నిచ్చే శక్తి ఉన్నదా లేదా అని గమనించాలి. ఈ సంకల్పంతోనే శ్రీ విశ్వనాథవారు 'నన్నయ్యగారి ప్రసన్న కవితార్థయుక్తి' అనే గ్రంథ వ్రాశారు. శ్రీ శ్రీ వ్రాసిన 'గురజాడ' గ్రంథం పై పుస్తకానికి దీటైనది.

'దేశభాషలందు తెలుగు లెస్స' అన్న సూక్తి గురజాడవారి రచనలు ఇంటింటా పారాయణ గ్రంథాలైననాడు, వ్యావహారిక భాషాసౌందర్యాన్ని రచయితలెల్లరూ గుర్తించిననాడు సార్థకమౌతుంది. అందాకా 'ఇంద్రగంటి' వంటివారు 'గురజాడ వాల్మీకి' అని ప్రస్తుతించినా, శ్రీ శ్రీ వంటివారు గురజాడ గొప్పతనమిదీ అని చెప్పినా గురజాడవారి రచనల పరమార్థం ఆంధ్రులందరూ పూర్తిగా అందుకోవటం జరుగదు.

రామమోహనరాయ్.

---

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna
The Andhra Patrika Press 6 & 7, Thambu Chetty Street, Madras 1
Editor : S. Sambhu Prasad